# జీవనగీత





ఖలీల్ జిబ్రాన్
'ది ప్రాఫెట్'కు
కాళోజి
తెలుగు సేత



యువభారతి
ప్రచురణ

# జీవనగీత

[ ఖలీల్ జిబ్రాన్ 'ది ప్రాఫెట్'కు తెనుగు సేత ]

కాళోజి

యువభారతి

రిజిష్టర్డు నం. 1/64.

సాహితీ సాంస్కృతిక సంస్థ.
5, కింగ్సువే, సికింద్రాబాదు.

JEEVANAGEETHA,
Kalojee

ముఖచిత్రం: బాపు

ప్రథమ ముద్రణ
1968
6,000 ప్రతులు.

ప్రచురణ:

యువభారతి

5, కింగ్సువే, సికింద్రాబాదు.

ముద్రణ:
శ్రీరామా పవర్ ప్రెస్
సికింద్రాబాద్.

వెల: అమూల్యము.

దేవా! నాదగు దృష్టి నీవగుము, నీదృష్టిఁ విలోకింతు నే
నీ విశ్వంబును, నాదు కేలగుము తండ్రీ! దాన యీ ధాత్రికిఁ
సేవల్ సేయుదు, నాకుఁ జిత్తమగుమా చిత్తంబునఁ సత్యబో
ధావిర్భావముఁ గూర్తు నీ జగతికన్నా! వేణుగోపాలకా!

అ ని

కో రి న

గు రు వి రా గి , రా గ న్న కు

లఘువురాగి, కాళన్న

బ్రతుకుబాటగా, ఖలీల్ జిబ్రాన్ పాడిన పాటను

వినిపిస్తున్నాడు.

# నివేదన




"యువభారతీ" వల్లరికి పూచిన ఈ 'జీవనగీతా' కుసుమాన్ని తెనుగు పఠితృలోకానికి సమర్పించుకోగలుగుతున్నందుకు మాకెంతో సంతోషముగావుంది.

యువభారతి కేవలం పుస్తకప్రచురణ సంస్థకాదు. తరుణులలో చక్కని వచోరీతులను, రచనారీతులను, ఆలోచనారీతులను అంకురింపజేసి వారిలోని సర్జనాత్మక శక్తిని నిర్మాణ కార్యకలాపాలవైపునకు మళ్ళించడానికి గత అయిదేండ్లనుంచి కృషిచేస్తున్న సంస్థయిది.

మంచిపుస్తకాలను అధ్యయన పరిధిలోనికి తీసుకొనిరావడం మాసంస్థ లక్ష్యంగా పెట్టుకొన్నది. మహాప్రస్థానం, కన్యాశుల్కం, కాలాతీతవ్యక్తులు, చివరకుమిగిలేది, విశాలనేత్రాలు వంటి ఉత్తమ గ్రంథాలను చదివించి తన సభ్యులలో ఈ పుస్తకాలనుగూర్చి చర్చ నిర్వహించింది.

ఉత్తమగ్రంథ ప్రచురణకు పూనుకొనడానికి ఈ సంస్థ ధనాఢ్యమైనదికాదు. సభ్యుల ఉత్సాహమే దీని సర్వస్వం.

కవితాకళను అభిమానించే రసికుల విరాళాలతో శ్రీ అనుముల కృష్ణమూర్తిగారి 'సరస్వతీ సాక్షాత్కారము' అను కావ్యఖండికను ప్రథమంగా ప్రచురించి ముందుగా విరాళాలిచ్చినవారికి అందజేసినాం. ఈ ప్రచురణలో యువభారతికి మిగిలినది తృప్తి, సంతుష్టి. అంతే!

తెనుగు రసికుల అశేష ఆదరాభిమానాలు, ఉదార హృదయాలు మా ఉడుతా భక్తిని ప్రోత్సహించినందుకు సంతోషం.

ప్రపంచంలోని అన్ని ఉత్తమ భాషల్లోకి, అనేక భారతీయ భాషల్లోకి వచ్చినవి ఖలీల్ జిబ్రాన్ పుస్తకాలు. కాని ఒక్కటికూడా తెనుగులోకి రాకపోవడం మన దురదృష్టమే. జిబ్రాన్ గ్రంథాలలో ఒక్కగ్రంథం **Prophet** కు ఇది అనువాదం. ఈ **Prophet** లోనిభావాలు ఎంత సుందరతరములో, ఎంతగాఢములో, ఎంత ఆర్ద్రములో అంత విప్లవాత్మకములు. జిబ్రాన్ భాష అరబ్బీ, కానీ—ఆయన తన గ్రంథాలను తానేఇంగ్లీషులోకూడా అనువదించినాడు. ఒక్క యింగ్లీషులోనే **Prophet** ప్రతులు 20 లక్షలు పైగా అమ్ముడుబోయి ఇప్పటికీ-ప్రతివారం 5,000 ప్రతులు అమ్మబడుతున్నాయని అమెరికా ఆంగ్లవార పత్రిక 'టైమ్' కథనం (ఆగస్టు 13'1965). మహాకవి, మహామానవుడు, దార్శనికుడు, సార్వకాలీన, సార్వజనీన సత్యాలను నిర్భయంగా ప్రకటించిన ద్రష్ట ఖలీల్ జిబ్రాన్. బ్రతుకుపైన ఆశలనుపెంచే ఆయన కవిత బ్రతుకు సొగసులను, శ్రమలోని సౌందర్యమును, మనిషిలోనిమంచితనమును ప్రతిపాదించిన జిబ్రాన్ సందేశం, ప్రేమ రాహిత్యంతో సతమతమౌతున్న జగత్తుకొక నూతన సందేశం. నిర్మాణావస్థలోనున్న మనస్వాధానికి ఒక చక్కని పునాది.

ఈ పుస్తక ప్రచురణకు విరాళాలనిచ్చి ముద్రణకు సహాయపడిన ఉదారులను, ఆ ఉదారులను వెతుక్కుంటూ — తిరిగిన మిత్రబృందానికి యువభారతి సర్వదా కృతజ్ఞ. ఎవరెవరో, ఎన్నెన్నివిధాలనో మాకు సాయపడినారు; చేదోడు వాదోడుగా నున్నారు. ఎవరిని చెప్పి ఎవరిని మరువవలె ? ఎందరో మహానుభావులు—అందరికీ మా వందనములు.

"జీవనగీత" ప్రచురణార్థం కాళోజీగారికి వేయి రూపాయల సహాయాన్ని అందజేసిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి కృతజ్ఞులం.

పదునాలుగేండ్లనుంచి మనకంతా అందకుండానే వుండిపోయిన ఈ జీవనగీతను, మానవతా మర్యాదలకు నివాళులెత్తిన కారుణ్యోపనిషత్తును, ఖలీల్ పాట—బ్రతుకుబాటను కాళోజి గొంతెత్తి తెలుగులో పాడగా మేము మీకా సంగీతాన్ని అందించడానికి యత్నించినాము, ఇది మా అదృష్టం. మహానుభావుల నిండుగుండెల అండదండలతో ఇది సాధించినాము ఇది మా భాగ్యం.

ప్రచురణ తొలిదశనుండి సలహాలను, ధైర్యాన్ని, ప్రోత్సాహాన్ని, యిచ్చి తమ సహృదయాన్ని చవిచూడనిచ్చిన యం. శేషాచలం కంపెనీ భాగస్వాములు, కార్యదర్శి అయిన శ్రీ ఎమ్. ఎన్. రావుగారికి, మా అభివాదములు.

అందముగా ముఖచిత్రం మలచియిచ్చిన శ్రీ బాపుగారికి వందనములు.

ఖలీల్ జిబ్రాన్ చిత్రలేఖకుడుకూడా! అతడు స్వయముగాగీసిన ముఖచిత్రానికి అనుకరణము అందజేసిన శ్రీ హెచ్. వి. రాంగోపాల్ గారిని యువభారతి మరవదు. అరచేతిలో కన్నున్న బొమ్మకూడ ఖలీల్ దే. దానికి ప్రతిరూపం రాంగోపాల్ గారిదే.

నిర్ణయించిన గడువులో చక్కగా అచ్చొత్తి యిచ్చిన శ్రీరామా పవర్ ప్రెస్ అధినేత శ్రీ పబ్బా శంకరయ్యగారికి యువభారతి నమస్సులు.

సహృదయులయిన మీ సహకార ఔదార్యాలతో ముందుకు సాగదలచుకొంటున్న,

యువభారతి

# ఖలీల్ తో కలయిక.

—కాళోజి

1953, డిసెంబరులో "నా గొడవ" రెండవ ముద్రణ సాగుతున్నది. మొదటి ముద్రణ, తర్వాతి గేయాలు కలిపి అచ్చుప్రతిని సిద్ధం చేస్తున్నాము. ఆ రోజుల్లో శ్రీ ఏల్చూరి సుబ్రహ్మణ్యం గారు హైద్రాబాదులో వున్నారు. వారి యింట, "నా గొడవ" ఎడిటింగ్ సాగింది. ఆఖరు పుటల్లో "చెలిమి" గేయం చదివి, సుబ్రహ్మణ్యం గారన్నారు— "మీరు ఖలీల్ జిబ్రాన్ రచనలు బాగా చదివి నట్లున్నారు" అని. "అతనెవరు ?" అన్నాను నేను. "అదేమిటి, ఖలీల్ జిబ్రాన్‌నే ఎరుగరా ?" ఎంతో ఆశ్చర్యంగా అడిగారు ఏసు గారు. "ఎరుగ నన్నాను" నేను. అప్పుడు వారు తమ వద్దవున్న "ది ప్రాఫెట్" అనే పుస్తకాన్ని వెతికితెచ్చి నాకు యిచ్చినారు. ఆ పుస్తకం యీ నాటికీ నా వద్ద ఉన్నది. "చెలిమి" గేయానికి బహుమతిగా, ఒక స్నేహితుడు యిచ్చిన కానుకగా, మానవతకు ప్రామాణిక గ్రంథంగా, బ్రతుకు బాటగా, జీవనగీతగా నాకడ వుండి పోయిందా పుస్తకం.

ఖలీల్ జిబ్రాన్‌తో ఎందరికో పరిచయం చేయించినాను. కొందరికి పుస్తకాలు కొని యిచ్చినాను. ఎందరి చేతనో కొనిపింప చేసినాను. ఖలీల్ గొడవను, నా గొడవగా చేసుకున్నాను. ఎక్కడ కూర్చున్నా ఖలీల్ జిబ్రాన్ ముచ్చటే. ఏ సభలో మాట్లాడినా ఖలీల్ సంగతే. ఎవరికి వుత్తరం వ్రాసినా ఖలీల్ గురించే.

1953 ఆఖరు రోజుల్లో తెలంగాణా రచయితల వార్షికోత్సవం జరిగింది. ఖలీల్ జిబ్రాన్‌తో పరిచయం గలిగిన వారం రోజులలో ఆ సభలు

జరిగాయి. "మంజీర" అను సంచిక వెలువరించినారు. దానిలో "కర్మ యోగము" అను పేరుతో "ది ప్రాఫెట్" లోని ఒక అధ్యాయం వెలిసింది. నాటినుండి నేటిదాక, ఖలీల్ జిబ్రాన్ పుస్తకాలు దొరికినన్ని చదివినాను, అనువదించినాను, మిత్రులకు వినిపించినాను.

"ది ప్రాఫెట్" పుస్తకం సొంతం తెనుగైంది, వ్రాత ప్రతి పోయింది. మళ్ళీ వ్రాసినాను. అప్పుడప్పుడు చేసిన అనువాదాలకు లెక్కలేదు. పొగొట్టుకొనడానికి హద్దులేదు. "ది ప్రాఫెట్" అనువాదం, బ్రతుకుబాట, ఖలీల్ పాట, మిత్రుడు "శశాంక", "జీవనగీత"గా నామకరణం చేసినాడు. వ్రాతప్రతి విని, తాను చదువుకుని, "జీవనగీత" విషయపరిచయ వ్యాసం వ్రాసినాడు. ఎందరో మిత్రులు "జీవనగీత" ప్రతులకై ఉత్తరాలు వ్రాసినారు. ఈ నాటికి, అది అచ్చు పురుడుకు నోచుకుంది.

ఖలీల్ జిబ్రాన్ జననం, 1883 లో. దేశం లెబనాన్. అతని మాతృభాష అరబ్బీ. తలిదండ్రుల మతానుసారంగా ఆతడు క్రైస్తవుడు. నిజానికతడు, మానవుడు. 1903 లో, అరబ్బీలో "ది స్పిరిట్స్ రిబెలియస్" ప్రకటింపగా, ఆయన విప్లవ భావాలకు ఆయనను దేశం నుండి బహిష్కరించారు. ప్రతులన్నీ స్వాధీనం చేసుకుని చౌకులో కాల్చివేసింది ప్రభుత్వం. ఆ వార్త ఖలీల్ జిబ్రాన్‌కు పారిస్‌లో అందింది. "బలేపని జరిగింది. రెండవ ముద్రణకు మంచి అవకాశం" అన్నాడట ఆ మహానుభావుడు!

ఆయన అమెరికావెళ్ళి, తరువాత ఫ్రాన్సువెళ్ళి, అక్కడ సంగీతమూ, చిత్రకళా నేర్చుకున్నాడు. అక్కడ నుండి 1912 లో అమెరికా వెళ్ళి, స్థిర నివాసం ఏర్పరచుకున్నాడు. తన జీవితంలోని ఆఖరి యిరవై ఏండ్లు ఖలీల్ జిబ్రాన్ అమెరికాలోనే గడిపినాడు. ఎక్కువ కాలం వున్నది న్యూయార్క్‌లో. అతని బస ఆనాటి చిత్రకారుల, రచయితల సమావేశ స్థలము. అతని గది చిత్రప్రదర్శనశాల. ఎప్పుడూ ఏదో ఒక చిత్రప్రదర్శనం, లేక నవీన రచన పఠనం, శ్రవణం, ఏదో చర్చ. ప్రేమ, జీవనం శ్రమ-అతని మూల సూత్రాలు.

మొదట్లో తన గ్రంథాలను, అరబ్బీలో వ్రాసి, ఆ తరువాత ఇంగ్లీషులో అనువదించే వాడు. ఆ తరువాత, ఇంగ్లీషులోనే వ్రాశాడు. జిబ్రాన్ సాహిత్యం లోని అన్ని శాఖలలోనూ కృషిచేశాడు. అతని పుస్తకాల పేర్లు చూస్తేనే తెలుస్తుంది. ఆ మనిషిలోని గొప్పదనం, నవ్యత, నాణ్యత—స్పిరిట్స్ రిబెలి యస్, మాడ్ మాన్, సాన్డ్ అండ్ ఫోమ్, ది వాన్డరర్, గార్డెన్ ఆఫ్ ది ప్రాఫెట్, జీసస్ ది సన్ ఆఫ్ మాన్, ఎర్త్‌గాడ్స్, టియర్స్ అండ్ లాఫ్టర్, సెల్ఫ్ పోర్ట్రైట్, ది వాయిస్ ఆఫ్ ది మాస్టర్, ది బ్రోకెన్ వింగ్స్, నింఫ్స్ ఆఫ్‌ది వాలీ, థాట్స్ అండ్ మెడిటేషన్, ది సీక్రెట్స్ ఆఫ్ ది హార్ట్, ఫోర్ రన్నర్.........యింకా ఎన్నో వ్యాసాలు, వచన గేయాలు, సాహిత్య గోష్ఠుల్లో చేసిన ప్రసంగాలు, మిత్రులకు వ్రాసిన ఉత్తరాలు, సాహిత్య పత్రికల సంపాద కీయాలు బోలెడు.

ఖలీల్ జిబ్రాన్ కవి, తాత్వికుడు, చిత్రకారుడు. నలభై ఎనిమిదేళ్ళు బ్రతికాడు. 1931 లో చనిపోయినాడు జిబ్రాన్. ఎల్లకాలం వుండే రచనలు సాగించినాడు. "రిటర్న్ ఆఫ్ ది ప్రాఫెట్" అనేది ఆయన రాద్దామనుకున్న గ్రంథం. మొదలు పెట్టాడట కూడా. కవిగా, చిత్రకారుడుగా అతనికి ప్రపంచఖ్యాతి లభించింది. అతడు బ్రతికివున్న నాటికే, ప్రపంచంలో పాతిక భాషల్లో అతని రచనలు స్థానం సంపాదించుకున్నాయి. నే నెరిగినంతవరకు, భారతీయ భాషలలో—హిందీ, తమిళం. మళయాళం, మరాఠీ, గుజరాతీ, బెంగాలీ, ఉరుదూ భాషలలో అతని రచనల అనువాదాలున్నాయి. యూరప్ లోని అన్ని భాషలను, ఖలీల్ జిబ్రాన్ రచనలు పలకరించినాయి. జపాన్ వారు కూడా, జిబ్రాన్ వాణితో తమ భాషను శోభిల్ల జేసుకున్నారు.

ఆయన మరణం తరువాత చాల సంవత్సరాలకు, 1948 లో, లెబ నాన్ స్వతంత్ర రిపబ్లిక్ అయ్యాక, ఆయన సమాధి త్రవ్వి, లెబనాన్‌లో సమాధి నిర్మించి, ఆయనను ఆరాధిస్తున్నారు.

ఖలీల్ జిబ్రాన్ చాలా చిన్న వయస్సులోనే Prophet అనే మహా కావ్యాన్ని మొదటిసారిగా అరబ్బీభాషలో వ్రాసినాడు. తల్లికి వినిపించినాడు.

'It is all right, but yet green' ('బాగానే వున్నదిగాని యింకా పసిగా వుంది') అన్నదట ఆ కన్నతల్లి. ఖలీల్ తన కావ్యాన్ని మళ్ళా దిద్దుకున్నాడు. కొన్నాళ్ళకు మళ్ళీ తల్లికి వినిపించాడు. మళ్ళీ అదేమాట. ఈ విధంగా ఏడు సార్లు పదేండ్లపాటు వ్రాయడం, వినిపించడం, మళ్ళీ దిద్దుకోవడం జరిగింది. ఏడవసారి విని తృప్తిపడ్డది తల్లి. ఖలీల్‌కు ఎంతో ఆనందం కలిగింది. అపుడు అది అచ్చుకు నోచుకుంది. మళ్ళీ కొన్నేళ్ళు గడిచినాయి. అరబ్బీలోని తన అమోఘ రచనను ఇంగ్లీషులోకి తానే చేయసాగినాడు. ఏరుకున్న గ్రంథం మళ్ళీ Prophet. ఐదుసార్లు ఏండ్లతరబడి ప్రయత్నించి ప్రస్తుతం మనకు లభించే ఇంగ్లీషు Prophet అచ్చు ప్రతి సిద్ధంచేసినాడు. 1923 లో ఇంగ్లీషులో మొదటిసారి అచ్చయింది. ఈ నాటికి ఇంగ్లీషులో వందలసార్లు అచ్చయి వుంటుంది. అమెరికాలో, ఇంగ్లండులో ఎన్నో ప్రచురణ సంస్థలు యెన్నెన్నో తీరులుగా దానిని ప్రచురించాయి. మహాభారతానికి పంచమవేదము అను పేరు వచ్చినట్లు Prophet అనే పుస్తకానికి 'The little Black Book', 'Blble Black Book' అను పేర్లు వచ్చాయి. అంటే బైబిల్ ఏభాషలో ప్రచురించినా దాని కవరు నల్లగా వుండడం ఆచారం. Prophet పుస్తకానికి కూడ నల్లకవరేవుంటుంది. అమెరికాలో కొన్ని దేవాలయాల్లో (చర్చి) Prophet గ్రంథపఠనం pulpit నుండి జరుగుతుంది.

'బార్బరాయంగ్' అనే అమెరికన్ రచయిత్రి This Man from Lebanon పేరుతో జిబ్రాన్ జీవిత చరిత్ర వ్రాసింది. ఆ పుస్తకం చదివితే మనకు తెలుస్తుంది, జిబ్రాన్ ఎంత గొప్పవాడనే విషయం. 1924 నుండి 1931 వరకు చాలా సన్నిహితంగా ఖలీల్ జిబ్రాన్ పరిచయ భాగ్యం లభించిన 'బార్బరాయంగ్' జిబ్రాన్ చరిత్ర వ్రాసి సాహిత్యరంగంలో మహాఘనకార్యాన్ని సాధించింది.

అతని పేరు 'అల్‌ముస్తఫ'
ఎన్నికయిన మిన్న అతడు
అందరి ప్రేమకు పాత్రుడు
తానుండిన కాలమునకు
తానె ఉషస్సైన వాడు.

పన్నెండేండ్లాయె నతడు
'అర్ఫలీజు' పట్టణాన
తిరిగి తనను తన ద్వీపము
జేర్చుటకై రానుండెడి
ఓడ కొరకు వేచివుండె.

పన్నెండవ ఏడు, పంటలు
కోసికొనెడు 'ఇలుల్' మాసంబున
సప్తమి తిథి నాడాతడు
'అర్ఫలీజు' పట్టణ ప్రాకారము
బయటనున్న కొండనెక్కి
రోజువలెనె చూచుచుండ,
మంచుపొరల వెంటవెంట
వచ్చుచున్న తన ఓడయె కనుపించెను.

అతని హృదయ కవాటాలు
తెరచుకొనెను, కనులు మూతపడెను,
పట్టరాని ఆనందము రెక్కవిప్పి
కడలివైపు పరుగెత్తెను,
మౌనాంతఃకరణమ్మున ప్రార్థించెను.
కాని—
కొండ దిగెడి సమయమందు
చింత అతని నలముకొనెను

గుండె పగిలి గొంతెత్తెను:
"నేనిప్పుడు పోవుటెట్లు,
వెత చెందక స్తిమితముగా
ఇచట నుండి పోవుటెట్లు ?
పో జాలను,
గాయపడని గుండియతో
పురము వదలి పోజాలను.
ఈ పురమును చుట్టియున్న
గోడల్లో నేగడిపిన
నానా బాధల దినాలు, ఏకాంతపు
నారాత్రులు ఎడతెగనివి.
తనబాధను తన ఒంటరి తనమును
ఎడబాయుచు మిడుకని వాడెవ్వడు ?

చిట్లి పగిలి పోయినట్టి
నాగుండియ తునుకలెన్నొ
ఈ నగరపు వీధులనే
చేతులార వెదజల్లితి.

నాకోర్కెల సంతానము
ఈ పురము చెంత కొండల్లో
బరి బాతగ పరుగెత్తెను
బాధపడని, బరువులేని గుండియతో
వాని నుండి దూరమగుట
నాకైతే చేతకాదు ఏమాత్రము.

నేనిప్పుడు
ఏదో ఒక పైయుడుపును
తీసి పారవేస్తుంటిన ?
కాదు కాదు
చేతులార నాతోలును
ఒలుచుకొనుచు నుంటినేను
ఏదో ఒక స్మృతి ఖండముకాదు
నేనిప్పుడు విడిచి చనుట

# 3

ఆకలి దప్పుల మంటల
అమృతా స్నాస్వాదించిన
హృదిని విడిచి వెళ్లుచుంటి.

అయినా నేనాగలేను
పోవుటయే తప్పనిసరి,
అన్నింటిని తను జేరగ
పిలవనంపు కడలితల్లి
కన్నకడుపు గారబమున
నన్నుకూడ పిలుచుచుండె
నేనిప్పుడె బయలుదేరవలె తప్పక.

ఇక ఆగుట యన—
ప్రజ్వలించు కాలగతిని కానకుండ
కదలలేక పడి ఉండుట
మంచుగడ్డగా మారుట
కరడు గట్టుకొని పోవుట
పోతకట్టునకు లొంగుట
చైతన్యము నెరుగకుంట.

ఇచటిదెల్ల నావెంటనె కొనిపోయిన
నాకెంతయు సంతోషము
అటుల జేయ నాకు
గలదు ఆరాటము
ఇచటిదెల్ల నావెంటనె కొనిపోవుట ఎట్లునేను ?

మాట—
తనను కని రెక్కలిచ్చి ఎగుర బంపు
నాలుకను పెదవులను
తనవెంట గొని పోనేపోలేదు కద ?
తానె—
ఒంటరిగా అంతరిక్షమంత నిండిపోవలె కద ?

# 4

తన గూటిని వదలివేసి
ఒంటరిగా గరుడ పక్షి
ఆకాశపుటంచులంట
ఎగుర వలెను
క్షితిజాలను కొలువ వలెను!

కొండదిగి నేలమీద కాలిడుచు
అతడు చూచె కడలివైపు మరొకసారి
అతని కపుడు దీరంబును చేరవచ్చు
తన ఓడయె కనుపించెను
ఓడపైన తిరుగువారు నావికులు
తన దేశీయులు కనుపించిరి.

ఎలుగెత్తెను అతని ఎడద
బయటపడెను పలుకులిటుల.
"ఓ నా సోదరులారా!
సనాతన జనని కూర్మి పుత్రులార!
ఆటు పోటు రౌతులార!
ఎన్నోమారులు మీరలు
నా కలలందున వచ్చియున్న వారలేను
ఈనాడు వచ్చినారు
నే మెలకువతో నుండగ
ఈ మెలకువ నాగోప్యంబగు కల.

ఇన్నినాళ్ల క్షణ క్షణము
ఎత్తిన తెర చాపలతో నా తహతహ
గాలి కొరకు వేచియుండె
మీ రాకకు చూచుచుండె
నే సిద్ధముగా నుంటిని యిప్పుడు
వచ్చి మిమ్ము చేరుటకై నే సిద్ధముగా నుంటిని.

మరొక్క ఊర్పు
కదలనట్టి పరిసరాల గాలినుండి

కేవలము ఒక్క ఊర్పు పీల్చుకొందు
మాయమమతలలముకొన్న మరొక్కచూపు
వీడనున్న పరిసరాలపైన
తుదిది ఒక్క చూపు సారింతును.
ఆ తదుపరి మిమ్ము జేరి
మీలో నొక్కని నౌదును
సాగర యాత్రికుల నడుమ
సాగర యాత్రికుడ నౌదు.

ఓ అనంత సాగరమా!
విశ్వమెల్ల ఒడినిడుకొని
పవళించిన ఓ మాతా!
ప్రేమ మూర్తి! శాంతరూప!
ఎడతెగని తహతహతో పారాడెడి
వాగులు సెలయేరులు
నీ ఒడిలో తల దూర్చి నపుడె
అపుడే కద శాంతించును.
శాంతి దాయనీ! జననీ!
ఈ బ్రతుకను వాగు
ఈ నా జీవన నదము
పరిసరాల పసరికలో
మరొక్క మెలిక తిరుగు
మరొక్క మలుపు మలుగు
తుదిసారిగ ఒకేసారి
కదలు మెదలు, మన్మరించు
తుది పలుకొక్కటి పలుకు
ఆ తదుపరి వచ్చి నిన్ను చేరిపోవు
అనంతమగు బిందువొకటి
అనంతమగు సాగరమున".

అనుచు పురమువైపు కదలి పోవుచున్న
అతని కపుడు కనుపించెను.
పొలము పుట్ర వదలి

ద్రాక్షవనముల వదలి
పురము వైపు పరుగెత్తుచు
పోవుచున్న జనుల గుంపు
పోవువారు ఎలుగెత్తుచు
ఒకరి నొకరు పిలుచుకొనుట
తన పేరును తలచుకొనుట
తనదు ఓడ రాకగూర్చి
పలుమారులు చెప్పుకొనుట
అతని కంత వినిపించెను
జనుల చూచి మాటలువిని
అతడిట్టుల మది దలచెను.

"ఏమిటి యిది కడు చిత్రము!
ఈ వీడుకోలు గడియయె
అవునా కలయిక గడియయు ?
ఏమిా నా అస్తమయము
వాస్తవముగ నా ఉదయమా ?
సగము చాలు దున్ని
అరక వదలివచ్చు వానికైన
మధువు చిలుకు గిలకవదలి
కదలివచ్చు వానికైన
ఏమి ఈయగలను నేను ?
వారల కర్పణము చేయ
నా హృదయము
ఫల భారముతో వంగిన
వృక్షమగున ?
నా కాంక్షలు కామనలూ
వచ్చువారి పాత్రలను నింపింపగ
పొంగి పొరలి ప్రవహించెడు ఊటలౌన ?
సర్వాత్ముని విరాట్ హస్త స్పర్శనమున
నాదామృత వాహిని యగు
వీణియనా నేనిప్పుడు ?

## 7

విశ్వమయుని ఊరుపుతో
గానామృత వాహిని యగు
వేణువునా నేనిప్పుడు ?
శాంతిని అన్వేషించుచు
మౌనంబుల వెదకి కొనుచు
తిరుగుచున్న వాడ నేను
సంశయమున కావంతయు
తావులేని మనసుతోడ
చుట్టుజేరు వారికి

దృఢ విశ్వాసముతో ఈయగ
మౌనమున, అభావంబున
దొరికిన పెన్నిధులెయ్యవి ?
ఈ సమయము
నా పంటలు కోసికొనెడి సమయమైన
గురుతులేని ఆ ఋతువుల
నే నాటిన పొలములేవి ?
వెలుతురులను వెదజల్లగ
నా దివ్వెను లేవనెత్తు
క్షణ మిదియే అయివుండిన
నాపమిదలోని స్నేహమంత ఉడుగుగాక
వత్తికూడ ఆరుగాక
వెలుగనట్టి వత్తితోడ
రిత్తయైన నా ప్రమిదెను
లేవనెత్తెదను నేను.
తేజోమయుడే దానిని
స్నేహముతో నింపి
తానే వత్తిని వెలిగించుగాక!"

అతడన్నవి యీ మాటలు—
అనుకొననివి మరియెన్నో
కలవాతని యెడదనిండ

పలుకుటకును వలనుపడని
దేదో లోనున్నది గోప్యము కన్నను లోతుది.

అతడు పురము చేరగనే
చేరిరంద రతని కడకు
డగ్గుత్తిక పడని వ్యక్తి
లేడచ్చట మచ్చుకైన
వయోవృద్ధులైన వారు
పురప్రముఖు లందరు
వచ్చి ముందునిల్చి
యిటు వాత్సల్యముతో పలికిరి.

"మా నాయన ! వెళ్లకు
మము విడిచి యిపుడె
వెళ్లబోకు ! మానాయన !
మా జీవితాల మలిసంజల మసకలందు
నీ యునికియె
పగటి వెలుగు చిమ్ముచుండె
వెళ్లకు మము విడిచి యిపుడె
నాయన ! మా నాయన !
తండ్రీ ! నీ జవ్వనమే
చేకూర్చెను మాకు కూడ
ముదిమిలోన జవ్వనాల
కలలు గాంచగల్గు శక్తి.
అర్ఫలీజులోన నీవు
అపరిచితుడవా ? అతిథివా ?
కాదు కాదు
నీవు మాకు ప్రియతముడవు
మా సంతానములో నొకడవు

మా కనుల కపుడె పూసిపోకు
మా నొసట నపుడె రాసిపోకు
నీ మోమైనను చూడ నోచుకోని పూత, రాత."

దేవస్థానమువారలు, అయ్యలు అమ్మలు
అతనిని సమీపించి విలపించిరి.
"మా అందరి నడుమ నేడు వాస్తవమగు
నీ యునికిని అపుడే స్మృతిగా మార్చకు.
కలుగ నీయకు కడలి అలలకు
మనల నెడబాపు వీలు.
నీవే చైతన్యముగ మాలో ప్రసరించినావు
నీ నీడలు వెలయించెను
మా మోములలో వెలుగులు
మేము నిన్ను ప్రేమించుట
ఇంతా అంతని కాదు
మా ప్రేమకు హద్దులేదు
మా మమతకు అంతులేదు
అయినా — ఈ క్షణము దాక అది మూగది
అగుపడక లోలోపల దాగున్నది.
కానీ ఈనాడు ఇపుడు
మా మమతల పావురాలు
నీ ముందర వచ్చివాలి బావురుమని ఏడ్చుచుండె."

ఇదియే గద ప్రేమ రీతి —
విడిపోయెడి పాడుగడియ దాపురించినపుడు కాని
ప్రేమకుసైతము తెలియదు తన తాహతు లోతుపాతు.

వారూ, వీరేమి ? అచట చేరిన వారందరును
పోవలదని బ్రతిమలాడ సాగిరి
దైన్యము బూనిరి.

అతడు మారుపలుకలేదు
కదలలేదు మెదలలేదు
వంచిన తల యెత్తలేదు.
కనుల జారి, ఎడద బారు
అశ్రుధార జూచినారు చేరువ నున్నట్టివారు.

నడచె నతడు, నడచె జనము
దేవాలయ ప్రాంగణమును చేరె అర్ఫలీజంతయు
ఆశ్రమమును వీడివచ్చె అల్‌మిత్రా సన్యాసిని.
ఆమె ద్రష్ట.
అల్‌ముస్తఫ కనులనెత్తి
ప్రేమ పూర్ణమగు చూడ్కులు ఆమెవంక సారించెను
అతడు అర్ఫలీజు పట్టణాన కాలిడగనె ఎదురువచ్చి
శ్రద్ధా భక్తులు చూపిన దామెయెకద.
అభివాదము చేసి ఆయమ
అతనితోడ నిటులపలికె.

"ఓ మహాత్మా! ఓ ప్రవక్తా! పరమతత్వశోధకుడా!
ఇన్నినాళ్లు ఓడకొరకు సముద్రాల దూరాలను
చూపులతో కొలుచుచున్న వాడవీవు—నేనెరుగుదు.
ఏతెంచెను నీదు నౌక, ఆగలేవు నీవు—
నీవిక పోవుటయే తప్పనిసరి!
నీ ఉన్నత భావములకు నిలయమైన దివ్యభూమి,
నీ కోర్కెల పుట్టినిల్లు, జన్మభూమి చేరుటకై
నీవుపడిన తహతహయును నేనెరుగుదు.
కావుననే, ఓ మహాత్మా!
పొమ్ము! ఆటంకములేదు పొమ్ము!
మా ప్రేమ నిన్ను బంధింపదు,
మా అవసరాలు నిన్నాపవు.

కాని కలదు ఒక ప్రార్థన—
శాశ్వత తత్వము సత్యము
నిత్యము సాక్షాత్కారము గలిగిన వాడవు కావున
ఆ సత్యము మాకిచ్చిపొమ్ము.
దాని తత్వమును గూర్చి పలికి మరీపొమ్ము—
మేము, దాని భద్రపరచి,
వారసత్వపెన్నిధిగా మాపిల్లల కిచ్చెదము
మా పిల్లలు తమ పిల్లల కిచ్చెదరు
ఈ తీరుగ శాశ్వతమగు నీసత్యము, మామధ్యన,
ఏకాకిగ సంచరించి
అలజడితో నిండియున్న మా పగళ్ల, మా దిగుళ్ల
అధ్యయనము జేసినావు
రాత్రులందు నిద్రలోని మా నవ్వులు, మా యేడ్పులు
నిద్రపోక ధ్యానముతో విన్నాడవు పనిపెట్టుక
మా యెరుకయె మాకులేదు
మమ్ము మాకు చూపింపుము.
జనన మరణములకు మధ్య నీకు విశదమైనదెల్ల
చెప్పుము వివరించి మాకు."

అంత నాతడనియె నిట్లు :
"అర్ఫలీజు వాసులార !
మీ మనస్సులందు లేనిదేది చెప్పలేను నేను,
నేను చెప్పగలిగినది మీమనసుల మసలునదే."

అప్పుడు అల్మిత్ర
“ ప్రేమ విషయము తెలియ జెప్పుము ”
అనగనె, అల్ముస్తఫ కన్నులెత్తి చూచెను
జనులందరిని. వారందరు
మౌన ముగ్ధులై పోయిరి.
అంతనతడు కంఠమెత్తి పలికె —

ప్రేమ మిమ్ము పిలువగనే
మీరు దానివెంట పొండు,
ప్రేమ త్రోవలు కఠినమైనను
నిటారయినను —
ప్రేమ రెక్కలార్చగనే
మీరు దాని వశముకండు,
ఈకల దాగిన కత్తులు
మిమ్ము గాయ పరచినను,

ప్రేమ మీతో పలికిన ప్రతి
మాట సత్యమని నమ్ముడు,
ఆ మాటల ధ్వని సైతము
తోటను కాటిని చేసెడి
ఆకురాల్చు కాలము వలె
మీ కలలను తున్ననకలు జేసినను.

ఏలన ?
మీ తలపై కిరీటాన్ని పెట్టినట్లె,
ప్రేమ మిమ్ము
సిలువ పైకి ఎక్కించును;
మీ పెంపునకు కారణ మైనట్లె ప్రేమ
మీ త్రెంపునకును కారణమగు.

ప్రేమ, పైకెగసి పోయి,
ఎండ పొడకు కంపించెడి
మీ కొటారు కొమ్మల చిగుళ్ల లాలించినట్లె,
దిగుచు లోతుకు జని,
భూమిని పెనవేసుకొన్న మీ వేర్లను
గునపమ్మై పెకిలించును.

ఎన్నులుగల కర్రలవలె
ప్రేమ మిమ్ము ఏరి కోసి,
తన కళ్లములో మెదవేయును;
బంతిగట్టి గడ్డినుండి విడదీయును,
పొట్టంతయు రాలునట్లు
రోళ్లబోసి మిము దంచును,
చేటల చెరగును, జల్లెడపట్టును;
పిండిజేయ మిము
తిరుగళ్లలొ బోసి విసరు;
జిగి, బిగి చేకూర్చుటకని
మిమ్ము తడుపు, నలుపు, ప్రేమ
ఆ తదుపరి, రొట్టెలుగా కాల్చి
మిమ్ము నైవేద్యముగా నొసగును.

మీ హృదయపు రహస్యాల
ఎరుక మీకు కావాలని
ప్రేమ మిమ్ము యిన్ని తీర్ల పుటము బెట్టు;
ఆ ఎరుక వల్ల మీకు కలుగు,
జీవనహృదయభాగమ్మగు భాగ్యము.

ఇటుల గాక
మీరు, మీకుగల భయాల ఒత్తిడిచే
ప్రేమనుండి కేవలము
శాంతియె, సుఖమె ఆశించిన—
దాని ఊరుపేరు ఎత్తకుండ
మీ భయముల ముసుగుల దాగుచు

ప్రేమ బంతికట్టు చోటు వీడి,
బయట పడి—ఋతు చక్రము జాడలేని
లోకము జేరుట మేలు.
అచట మీరు నవ్వెదరు
కాని,
మీ నవ్వంతయు నవ్వలేరు
అచట మీరు ఏడ్చెదరు
కాని,
మీ ఏడ్పంతయు ఏడ్వలేరు.

ప్రేమ యిచ్చునది ప్రేమయె,
ఇవ్వలేదు ఇంకేదియు;
ప్రేమ తీసికొను ప్రేమయె
తీసుకొనదు ఇంకేదియు;
ప్రేమ వశము చేసుకొనదు
వశము కాదు తానెప్పుడు
ప్రేమకు ప్రేమయె చాలును.

నీవు ప్రేమించినపుడు—
"దేవుడు నాహృది కల" దని
అనకూడదు.
అంతకన్న,
"దేవుని హృదయాన నేను ఉన్నా" నని
అనవచ్చును.
ప్రేమకు మార్గము చూపుట శక్యంబని
తలచ రాదు,
మీరు ప్రేమ కర్హులయిన ప్రేమ మీకు
బాట జూపు,
ప్రేమకు మరో కోర్కె లేదు
స్వయం సంతుష్టి తప్ప.

మీరు ప్రేమించి నపుడు
ప్రేమకు తోడుగ, నీడగ

ఇతర కాంక్షలేవైనను
ఉండుట సబబని ఎంచిన
ఈ తీరుగ కాంక్షించుడు.
రాత్రికి వీనుల విందుగ
పాడుచు ప్రవహించునట్టి
వాగుగ ఉప్పొంగాలని—
సౌకుమార్యము తీపు
ఎరుక కావాలని—
ప్రేమ ఎరుక అగ్గిలో బడి
సంతప్తుడ కావాలని—
ప్రేమోపహారముగా
నా రక్తము చిందాలని
ఇష్టపడుచు సంబరముతో
నా రక్తము ప్రేమార్పణ చేయాలని—
రెక్కలు విప్పిన ఎడదతొ
ప్రొద్దుపొడుపుతోడ నిద్ర లేవాలని—
ప్రేమింపగ లభ్యమాయె
మరోదినము 'ధన్యోస్మిని' అని
అనాలని—
ప్రేమ గూర్చి పారవశ్య చింతనతో
మధ్యాహ్నపు విశ్రాంతిని గడపాలని—
క్రుంకు పొద్దుతోడ
నేను ధన్యుడనై ఇల్లుచేరు కోవాలని—
ప్రేమించిన వ్యక్తికొరకు
నా హృదయము ప్రార్థింపగ,
పెదవులపై ప్రస్తుతి గీతము నర్తింపగ
నిద్రించాలని.

వైవాహిక బంధన మన యేమిటి? అని
అల్మిత్రయె ప్రశ్నింపగ విని
అల్ముస్తఫ ఇట్లనె:
వైవాహిక బంధనము సనాతనము
పుట్టినపుడె జంటలుగా పుట్టినారు మీరందరు
జంటజంటగానె కలసి వుంటారు మీరెప్పుడు
మీ జీవితాలను చావు-చేతులు చెండాడినను
మీరు జంట వీడకనే వుంటారు వాస్తవముగ
పరాత్పరుని స్మృతియందును
మీరు కలసియే వుందురు
విడిపోవని జంట మధ్య
ఎడము మాత్ర ముండవలెను
స్వర్గసమీరాలచ్చట
నాట్యమాడు చుండవలెను
జంట నడుమ తావుంచుట మీ బాధ్యత
ఒకరి నొకరు ప్రేమింపుడు—
కాని :
ఈ షణ్మాత్రము ఆ ప్రేమ మీకు బంధనమ్ము కాగూడదు ఏక్షణమున.
అంతకన్నను మీరు మీమీ యెదదలను తీరాలు జేయుడు
ప్రేమ కడలిని వాని మధ్యనజేరి అల్లల్లాడ నీయుడు
ఒకరి పాత్రను ఒకరు నింపుడు
కాని యెప్పుడు ఏక చషకమునుండి పానము చేయబోకుడు
ఒకరి కబళము ఒకరి కీయుడు
కాని యెప్పుడు ఒకే కబళము పంచుకొని సేవింప బోకుడు.
సంతసంబుగ ఎల్లవేళల కలసియాడుడు కలసిపాడుడు
కాని యెప్పుడు వేరువేరుగ నిలచి ఉండుడు.
ఎవరి వ్యక్తిత్వంబు వారు నిలుపుకొనుడు

వీణతీగలు రాగమందున ఏకమయ్యును
దేనికయ్యది వేరువేరుగ నిలచి వుండును
స్వీయకంపనముతోడ పలుకును.

ఒకరికొకరు హృదయములను వాయనంబుగ ఇచ్చుకొనుడు
కాని యెప్పుడు ఒకరియెడదను ఒకరి గుప్పిట పెట్టబోకుడు.
ఏలయన ?
సనాతనమగు విశ్వజీవనమునకధీనములై నయట్టివి మీయెడందలు.

జంట వీడక నిలచియుండుడు
కాని యెప్పుడు యేకమయ్యేడి సాహసంబును జేయబోకుడు.

ఆలయపుస్థంభాలు సతతము వేరువేరుగ నిలచివుండును
మంటపమ్మును తలనుదాలిచి ఒకటినొక్కటి కలసివుండును.

తీగనీడలోన మ్రాను, మ్రానునీడలోన తీగ
ఎదుగదెపుడు బ్రదుకదెపుడు.

అంత నచట:
తనశిశువును ఒడినిడుకొని చన్నుకుడుపుచున్న మాత
పిల్లల విషయము నడుగగ యిటుల పలికె అల్ ముస్తఫ —
మీ పిల్లలు కానెకారు మీ పిల్లలు
సతతము జీవింపకోరు జీవనపు కొడుకులు కూతుళ్లు వారు.

వారు పుడమి జేరుకొనగ ద్వారంబులు తలితండ్రులు
మీ ద్వారనె కాని వారు మీనుండి రారెపుడును
మీకడనున్నను వారలు మీ వారలు కానెకారు
మీ ఆస్తివంటివారు కారు మీ పిల్లలు.
మీ ప్రేమను వలసినంత వారిపైన ఒలికించుడు
ఆలోచనలను మాత్రము వారి తలల రుద్దకుడు
ఏలన —
వారలకును వారిస్వంత ఆలోచనలు కలవు.

వారి దేహాలను కాపాడెడి గేహాలను నిర్మించుడు
కాని వారి యాత్మలకై పంజరాల నల్లకుడు
ఏలన—
ఆ ఆత్మలు నివసించును భవితవ్యపు ఆలయమున
ఆ ఆలయ దర్శనము కలనైనను కాదుమీకు.

పిల్లలవలె వర్తింపగ ప్రయత్నింపవచ్చు మీరు
మీ వలె వారిని చేయగ యత్నింపగరాదెప్పుడు
**ఏలన—**
జీవనము వెనుకకు నడువదు
భూతము చేజిక్కి బ్రతుకు తన్నుకలాడదు, ఆగదు

ప్రాణముగల బాణములటు
బాలల సంధించి విడువ ధనువులు మీ తనువులంతే.
అంతులేని భవితవ్యము లక్షించుచు
ధనుర్ధరుడు తనబాణము లతిదూరము రువ్వడిగాపోవాలని
తనశక్తిని ప్రయోగించు మిమ్ము లొంగదీసి వంచు
ఆ ధనుర్ధరుని చేతులలో మీ లొంగుట ఎల్లప్పుడు సుఖవంతమె
హాయిని చేకూర్చునదే అగును
ఏలన—
రివ్వున బోయెడి బాణము వలెనే
కదలక నిలిచిన ధనువును సయితము
ప్రేమించును ధనుర్ధరుడు.

అంతనచట చేరియున్న ధనికుడొకడు
దానము గూరిచి అడిగిన
ఇటుల పలికె అల్ ముస్తఫ:
మీ ఆస్తిపాస్తుల నిచ్చివేయుట
ఇచ్చివేయుట కానెకాదు.
మిమ్ములను మీరిచ్చుకొనుటే
ఇచ్చివేయుట నిజము చూడగ.
రేపు అవసరమగును అనియెడి భయముపేరిట
భద్రపరచిన వస్తుచయమే ఆస్తిపాస్తులు.
పుణ్యస్థలములకేగు యాత్రికుల వెంటబోయెడి కుక్క
మజిలిలోపటి యిసుకలో
దూరదృష్టితో దాచుకొనియెడి ఎముకమాదిరి
రేపు అవసరమగును అనియెడి భయముపేరిట
భద్రపరచిన వస్తుచయమే ఆస్తిపాస్తులు.
తిరిగి ఆకలి కాకమున్నే మజిలివదలెడి యాత్రికులతో
వెళ్లిపోయెడి కుక్క యెక్కడో?
దాచుకున్న ఎముక యెక్కడో?
అక్కర విషయం భయము
అక్కరగాక మరేమిటి?
నిండు బావులు మీకు వుండగ
దప్పి విషయము భయముజెందిన
ఆ దప్పి తీరని దప్పికయెకద.

కలరు కొందరు—తమకు కలిగిన దెంతొ వుండగ
దాని లోనిదొకింత దానము చేయువారలు.
తాము జేసెడి దానమును ప్రజలందరును
గుర్తింపవలెనని మాత్రమే వారిచ్చుచుందురు.
వారి యాప్రచ్ఛన్న కామనవలన దానమరిష్టమేయగు.

కలరుకొందరు—వారికున్నది స్వల్పమైనను
ఉన్నదంతయు యిచ్చివేతురు.
అట్టివారలు—జీవితమున,
జీవితపు నిండుతనమున నమ్మకమున్నట్టివారు.
వారి ఖజానాకెప్పుడు వెలితిలేదు.
కలరుకొందరు—వారెప్పుడు సంతోషముతో నిత్తురు.
ఆసంతోషమే వారుచేయు దానమునకు బహుమానము.
కలరుకొందరు—వారెప్పుడు దుఃఖమునొందుచు నిత్తురు
ఆ దుఃఖమె వారుచేయు దానమునకు ప్రాయశ్చిత్తము.
కలరుకొందరు—వారు ఇత్తురు,
బాధనొందరు, సంతసింపరు,
దానమనునది సత్కార్యమ్మను సంగతైన మదిదలంచరు.
లోయలోని అడవిమల్లెలు
పరిమళాలను గుబాళించినటుల వుండును వారిదానము
వారిచేతుల దేవదేవుడు నోరుచేసుక పలుకుచుండును
వారి కన్నులవెనుకనుండే దేవదేవుడు నవ్వుచుండును.
అడిగినప్పుడు యిచ్చుచుండుట మంచిదె
కాని—
అడుగకుండనె అక్కరను గుర్తించిఇచ్చుట గొప్పతనము.
చేతికి ఎముకలేనివారికి, ఉదారహృదయులు అయినవారికి,
అక్కరవున్నట్టివాని వెదుకాడుటలోనే
ఎక్కుడు ఆనందము, అసలు దానముచేయుటకన్నను!
వాస్తవమాలోచించిన
ఇవ్వక బిగపట్టుకొనగ మీకడనేమైన కలదా?
మీకడనున్నది సర్వము ఏదో ఓనాడు
మీరు యిచ్చివేయవలసినదే, వదలి వెళ్లవలసినదే
అందుకనే వున్నదేదో యిచ్చివేయుడు, యిప్పుడే.
దానఋతువు దాటిపోయి వారసులకు చిక్కకుండ
దాని నిపుడె మీదానిగ జేసికొనుడు, సద్వినియోగము జేయుడు.
"మేమూ యిస్తాము—కాని
పాత్రుడైన వానికె మేమిస్తా"మని అనుచుందురు మీరెప్పుడు
మీ తోటలలోనిచెట్లు, మీ మందలలోని పసులు

ఆతీరుగ పలుకవెపుడు—ఇచ్చును అవి బ్రతుకాలని
'ఇవ్వక బిగబట్టుటయే చచ్చుట' యని యిచ్చును అవి
బ్రతికి వుండుటయే స్వయముగ దాన పాత్రతకు సాక్ష్యము
సృష్టికర్త దృష్టిలోన ప్రకృతి సిద్ధమైనదెల్ల
అనుభవింప పాత్రుడేను, బ్రతికివున్నప్రతివాడును
అట్టివాడు మీకడ నున్నట్టిదెల్ల
స్వీకరింప అనుభవింప పాత్రుడు కాకుండునెట్లు?
జీవన వాహినినుండి దప్పితీర్చుకొను అర్హతగలవాడు
తప్పకుండ మీ చెలమలనుండికూడ దోసిళ్లనునింపుకొనగ అర్హుడేను.
పుచ్చుకొనెడి సంసిద్ధతలోన యిమిడియుండినట్టి
సాహసము, విశ్వాసము—అంతెకాదు,
అతడు చూపు ఔదార్యమునకుమించిన
పాత్రత, అర్హత యింకేమికలదు?
అంతేనా?
ఇంతకు మీరెవరని? అంతపాటి ఏఘనులని?
అక్కర వున్నట్టివారు
సిగ్గువిడిచి మీముందర నిలుచుటకు,
వారి అభిమానము చితుక
మీరు కన్నులార గాంచుటకు
మీరెవరని? అంతపాటి ఏఘనులని?
అంతకన్న—దానమనెడి సత్కార్యము జరుగుటకు
సాధనముగ వర్తించెడి రాత మీకు కలదో లేదో
అది తేల్చుకొనుడు ముందు; ఏలన—
నిజము చూడ—జీవనమే
జీవనమునకు దానముచేయుట యిచ్చుట
దానకర్తలము తామని భావించెడి వారందరు కేవలము సాక్షులేను.

ఇక స్వీకరించువారు;
నిజముచూడ—అందరును స్వీకరించు వారలేను
అనవసరముగ కృతజ్ఞతను కొండజేసి
దాని బరువుక్రింద నలిగి పోబోకుడు.

దానమును

ఇటు మీ మెడపై అటు యిచ్చువానిమెడపై

కాడిజేసి మోపకుడు.

అంతకన్న—జరిగినట్టి దానంబును రెక్కలుగ జేసికొని

దానకర్తతోడకూడి పైకెగురుడు.

ఏలన—

ఋణభారము గుర్తించుట

ఋణము తీరదని పలుకుట

కామధేనువైన భూమి తల్లిగను

సాక్షాత్ ఈశ్వరుడే తండ్రిగను

ఉన్నట్టి దానకర్త ఔదార్యము శంకించుట.

అప్పుడొక వయోవృద్ధుడు పూటకూళ్ల యింటివాడు
తినుట త్రాగుట గురించి చెప్పుమనిన
ఇటులపలికె అల్ ముస్తఫ:

మంటి ఘుమఘుమల పీల్చి మనగలిగిన,
గాలిపీల్చి వెలుగుమేసి బ్రతుకునట్టి తీగవోలె
మీరును మనగలిగిన, ఎంతో బాగుండెడిది!
అది సాధ్యము కానప్పుడు
తినుటకు ప్రాణముతీయుట
తప్పనిసరి అయినప్పుడు
దప్పితీర్చుకొనుటకు పసిదూడ నోరుకొట్టి
దాని తల్లిపాలు కాజేయుట
తప్పనిసరి అయినప్పుడు—ఆ చంపుట,
ఆదోపిడి, పూజాకార్యమువలె జరుపుకొనుడు.
అడవిలోన విచ్చలవిడిగా పెరిగెడి తిరిగెడి
పెరటిలోన అదుపులోన పెరిగెడి తిరిగెడి
శుద్ధమైన నిష్పాపమైన ప్రాణాలను
అంతకన్న శుద్ధమైన నిష్పాపమైన మీప్రాణాలను రక్షింపగ
బలిగొనుటకు వంటగదిని, భోజనశాలను
బలిపీఠముగాను, యజ్ఞవేదికగాను జేసికొనుడు.
ఆహారముకొరకునొక్క ప్రాణిని బలిగొనునపుడు
మీ హృదియందున యీవిధముగ ప్రార్థించుడు
ఏశక్తికి లొంగినీవు నాచేతుల మడిసినావో
ఆ శక్తికే నేనుకూడ బలియౌదును
నీవలెనే నేనుకూడ ఆహారంబై పోదును.
ఏన్యాయము నిన్ను నాచేతికప్పగించినదో.
ఆన్యాయమే నన్నుకూడ
నాకన్నను బలయుతమగు మరోచేతికప్పగించు.

నిజముచూడ—నారక్తము, నీరక్తము రెండుకూడ
జీవన వృక్షమును పెంచు ఎరువులేకద.
పంటికింద ఏదోఒక పండు నలుగుచున్నప్పుడు
దానితోడ మనసువిప్పి యాతీరుగ మాటాడుడు
నీ విత్తనాలు బ్రతికివుండు నాదేహాంతర్దేహముగా
పూయనున్న నీపూవులు విప్పారును నా యెదలో
నీఘుమఘుమలను నావూపిరి గుబాళింప జేయుచుండు
ఈక్షణమునుండి నీవు నేను కలసిమెలసి జంటగానె
అన్ని ఋతువులందుకూడి ఆడుదాము పాడుదాము
సంతసముగ బ్రతుకుదాము
ఆకురాలు కాలమందు
పిండి, వండి మధువుచేయ
ద్రాక్షపండ్ల గుత్తులను కోయునపుడు
ఈవిధముగ వాపోవుడు:
"నేనుకూడ ద్రాక్షపండ్ల గుత్తులతో నిండినట్టి తోటనె సుమ
ఈ నాపండ్లుకూడ మధువుజేయ త్రెంపబడును
క్రొత్త సారాయివలెనె నేనుకూడ
దాచబడుదు సనాతనమగు ఘటముల."

చలికాలమున ప్రాతబడిన సారాయము
వెలికితీసి త్రాగునపుడు
మీహృదయము పాడవలెను ఒక్కొక్కపాట
ప్రతి పాటలొ గడచినట్టి
ఆకురాలు కాలము స్మృతి,
పండ్లుకోసుకొన్నయట్టి ద్రాక్షవనములస్మృతి,
మధుర రసమును చిలికించిన గిలక స్మృతి
చేరి యుండవలయు.

అంతట నొకకాపుబిడ్డ
కాయకష్టము గూరిచి చెప్పుమనిన
ఇటులపలికె అల్ ముస్తఫ:

జగతిలోను, జగత్తంత విలసిల్లెడి ఆత్మతోను
సమగతులగుటకె శ్రమంబు.

సోమరియై మనుచుండుట
చైతన్యముతో పరుగిడు ఋతువులెరుక లేకుండుట
సోమరియై మనుచుండుట
సిరులతోడ తులతూగుచు
ఆత్మసమర్పణవృత్తి ననంతుకడకు పోవుచున్న
కర్మవీర శ్రేణినుండి వైదొలగుట.

పనులుజేయుచున్నప్పుడు మీరందరు వేణువులు
గడిచెడిగడియల గుసగుస
గానముగ మారిపోవు
ఆ వేణువుల ఎదలజేరి
మృదుమధురస్వనముతోడ
అఖిల చరాచరమెప్పుడు బృందగాన మొనరింపగ
పలుకలేని కదలలేని వెదురువోలె
పడియుండుట కెవరు సమ్మతింతురిల?
శ్రమయనగా శాపంబని
కష్టము దురదృష్టంబని
చెప్పబడిన మాటలు మీరొప్పుకొనుచు వచ్చినారు
నే జెప్పెడి మాటేమన
శ్రమజేయుట, కష్టించుట
పుడమితల్లి యేనాడో గాంచిన కలలోని
ఒక్క అంశము సఫలముజేయుట

పుడమితల్లి కలగాంచిన యపుడే
ఆ అంశంబును నెరవేర్చెడి భారము
మీపైన బడెను—ఇపుడు కాదు
శ్రమతో అనుసంధానమే జీవనమును ప్రేమించుట
శ్రమద్వారా జీవనమును ప్రేమించుట
నిగూఢ జీవనరహస్యాలతో ప్రగాఢమగు పరిచయముగలుగుట.

దుఃఖావేగముతోడ జన్మించుటె పాపంబని
దేహ ధారణంబె నొసట వ్రాయబడిన శాపంబని
మీరలు భావించినను;
శ్రమఫలమున నొసటోడ్చెడి చెమట జాలె
ఆ పాపము పారద్రోలు
ఆ శాపము కడుగజాలు బలముగలది మరేదికాదు.

కుళ్లి కుమిలి బూజుబట్టినట్టివారు చెప్పినారు
'జీవితము అంధకార బంధుర'మని
కుళ్లికుమిలి బూజుబట్టినట్టి స్థితిని
మీరుకూడ ఆ మాటే నమ్మినారు—ఆమాటే అన్నారు.

నిజమే ఆమాటకూడ
జీవితమంతయు చీకటి నిజమే—
ప్రేరణ లేకున్న;
ప్రేరణ సహితము గ్రుడ్డిది—
జ్ఞానము లేకున్న;
జ్ఞానంబంతయు మిధ్య—
ఆచరణము లేకున్న;
ఆచరణము వృధా వృధా—
ప్రేమమయము కాకున్న.

ప్రేమగలిగి శ్రమలోర్చిన సమయమందు మానవుడు
తనతో తానేకాదు, తానితరులతోనెకాదు
సర్వేశ్వరుతో సహితము సంబంద్ధుండై పోవును.

ప్రేమగలిగి కష్టించుట యననేమిటి?
ప్రేమగలిగి కష్టించుట—
హృదయతంతువులనుదీసి వస్త్రంబునేయుచుంట
తనకు ప్రాణమైనవ్యక్తి ఆవస్త్రము ధరియింపగ నున్నటులయెంచి;
అనురాగం బుట్టిపడగ గృహనిర్మాణముజేయుట
తనకు ప్రాణమైనవ్యక్తి ఆ గృహమున నివసింపగ నున్నటులయెంచి;
స్నేహమార్ద్వాలతోడ పొలమలుకుట,
పండినపంటను అమితానందముతో కోసుకొనుట
తనకు ప్రాణమైనవ్యక్తి ఆపంటను ఆరగించుననియెంచి;
తానిర్మాణముజేసెడి వస్తుచయము కణకణమున
ఆత్మ నిశ్వసనముజేయుట, చైతన్యముతోనింపుట;
తాము జేయుచున్నపనులు స్వర్గవాసులగు పితరులు
చుట్టుజేరి జాగ్రత్తగ పరిశీలన జేయుదురను విషయంబెరిగియుంట,

'చంద్రకాంత శిలనుజెక్కి ఆత్మలోని భావనలను సాకారముజేయు శిల్పి
పొలము దున్నువానికన్న ఘనుడటంచు,
ఇంద్ర ధనువులో నగుపడు రంగుల చేపట్టి
వింతవింత సొంపులతో, జీవితము తొంగిచూచు వంపులతో
తా కలగాంచిన అందాలను ఫలకముపై దిద్దునట్టి చిత్రరచనాచార్యుడు
చెప్పుముడుచువానికన్న ఘనుడటంచు'
నిద్రలోన కలవరించినటుల మీరలనుచుండుట నేవింటిని
నిద్రమత్తుతోగాదు
పూర్ణజాగ్రదవస్థతో నేజెప్పెడి మాటేమన
అటునిటు పారాడుగాలి
తనమార్గమునందుండిన గడ్డిపోచతో నెంతటి
గారాబముతో కలియునో, పలుకునో,
అంతకన్న యెక్కుడు ప్రేమతోడ
వటవృక్షముతో కలియదు పలుకదు
ఆ గాలిని తన హృదయపు గాయాలలోననింపి
ప్రేమలాలనల దానిని తీయనిపాటగమార్చెడి
వాడొకండె ఘనుడు—మరెవడుకాదు.

శ్రమయనగా సాకారంబైనప్రేమ.

ప్రీతియుక్త కార్యాచరణంబు మీకుచేతగాక
నిరసన భావంబుతోనె మీరు పనులు జేయుచున్న
అంతకన్న మీరలు మీ కార్యకలాపాల వదలి
ప్రీతిగలిగి శ్రమలోర్చుచు గడియించినదాన కొంత
ఆనందముగా దానంబొనరించెడి భక్తులకడ
దేవాలయ ప్రాంగణమున బిచ్చమెత్తుకొనుటమేలు
ఏలన—
నిరసన భావంబుతోడ వండిన వంటంత
చేదుచేదైపోవుటెకాదు
మొదటిబుక్క తినకముందె తినువానికిగల ఆకలినేచంపివేయు
అనిష్టముతో ద్రాక్షరసము పిండ
మీరు గిలకను త్రిప్పుచున్న, చిలికిన మధుర రసమునిండ
మీ అనిష్టమే విషమైచిలుకును.
ఆప్యాయతలేక అచ్చము గంధర్వులవోలె మీరుగానముచేయుట,
ఎల్లప్పుడు ఎల్లెడలను మృదుమధురస్వనముతోడ
అఖిల చరాచరముచేయు బృందగానమును సహితము
విననీయక వినువారలచెవులు గడియపడవేయుట.

అచటనున్న స్త్రీ ఒకర్తు
'సంతోషంబన నేమిటి?
దుఃఖంబనగానేమిటి?'
అని ప్రశ్నింపగ నప్పుడు
ఇటుల పలికె అల్‌ముస్తఫః

మీ సంతోషము
ముసుగును తొలగించిన మీ దుఃఖము.
మీ నవ్వులు సంతసాలు పొంగిపొరలు బావికిగల
వూటలన్ని గతమందున
మీ దుఃఖము వొనగూర్చిన కన్నీళ్ళే.
ఇట్లుగాక వేరెట్లగు?
ఎక్కువ ఇంకాఎక్కువ దుఃఖము మిమ్ముతొలచుకొలది
సంతోషము నింపుకొనెడి మీపాత్రత పెరుగుచుండు.

వామి మంటలో కాలుటచేత నేకద
మట్టికి మధురసము నింపుకొను పాత్రతచేకూరుట
ప్రాణానికి హాయిగూర్చు మురళిరూపు దాల్చుటకై
వెదురు తాను ఎదనిండ కత్తికాట్లు పోట్లు తిన్నదెకద?
సంతోషము కలిగినపుడు మీహృదయపుటంచుల సందుల
తేరిపార జూచుకొనుడు.
ఇదివరలో మీదుఃఖానికి కారణమైనదె ఇపుడు
సంతోషము చేకూర్చుచు వుండెననుట తెలియవచ్చు
అట్లే—దుఃఖము చేకూరినపుడు,
మరోసారి తేరిపార హృదయపుటంచుల సందులచూచుకొనుడు.
ఇదివరలో పొందినట్టి సంతోషానికి కారణమైనట్టిదే
ప్రస్తుతము దుఃఖము చేకూర్చుచుండెననుట మీకుతెలియవచ్చు.

దుఃఖము కన్నను సంతోషమె గొప్పదిఅని
మీలోకొందరు అందురు.
కాదుకాదు దుఃఖమేగొప్పది అని మరికొందరు అనుచుందురు.
అటులగాక, నేను చెప్పునది యేమన
ఆ రెండును ఒక్కటెయని, విడదీయుటకు వీలులేనట్టివియని,
అవియెప్పుడు కలిసిమెలిసియే వచ్చును.
ఎల్లప్పుడు, ఆరెండును మీ అతిథులేను
మీ సహపంక్తినిచేరి ఒకటి తినుచుండగ
మరొకటి మీపడకగదిలో విశ్రమించుచుండునెపుడు.
వంతుల వారిగ అవి మీసహపంక్తిని చేరుచుండు.

సుఖదుఃఖమ్ముల మధ్యన తక్కెడవలె వ్రేలాడుచు మీరుందురు.
సుఖము, దుఃఖము రెండును లేనప్పుడే
మీడెందము నిశ్చలమై యలరారును,

సకలైశ్వర్యాధీశుడు
తనవెండిని బంగారమ్మును తూచుటకని
మిమ్ము వాడుకొన్న సమయమందు
మీహర్షము మీదుఃఖము ఆటుపోటులోనుండును.
అప్పుడుమీరు క్రిందుమీదులగుచుండుట తప్పదుమరి.

ఆ తదుపరి ఒకసుతారి; 'ఇండ్లసంగతేమిటి' అన
పలికెనిటుల అల్ ముస్తఫ:

ఊరిలోన ఇల్లు కట్టుకొనకముందే
మీలోపలి మరుభూమిని
ఊహలతాకుంజమొకటి అల్లుకొనుడు:
ఏలన:—
సంజమసకల మీకు మీమీ ఇండ్లజేరెడి
సంబరాలున్నట్లుగానే;
మీలో దేశదిమ్మరి అయినవానికి
ఎప్పుడు దూరముగానే వుండెడి ఒంటిగానికికూడ వున్నవి సంబరాలు.

మీగేహము—ఆకారముపెంచుకొన్న మీ దేహము
పగటివేళలందు ఎదిగి నిశ్శబ్దపురాత్రులందు పవళించును.
అది కలలుకాంచలేనట్టిది కానెకాదు.
మీగేహము కలలు కనదా?
కలలయందు ఊరువదలి,
పచ్చని లోయలనీడల, ఎత్తగు కొండలకోనల చేరుకొనదా?

మీ ఇండ్లను దోసిళ్లతో లేవనెత్తి
అడవిలోనో, పసరిక బయళ్లలోనో
గింజలవలె వెదజల్లెడి శక్తియె నాకుండియున్న
సంతోషించెడి వాడను,
లోయలె మీ రహదారులు, పచ్చనిబాటలె సందులు,
ద్రాక్షవనముల ఛాయలె ఒండొరులను అరయు కలయు స్థలముకాగ,
అచట మనసారగంతులేసి, సంతసమున పొర్లాడి,
శరీరాలు, ముస్తాబులు మంటిపరిమాళాలుచిమ్మ మీరు మీ ఇండ్లకు
చేరుకొన్న ఎంతోబాగుండెడిది.
కాని: ఇపుడపుడే అటుల జరుగునట్లులేదు.

భయముజెంది, దిగులుపొంది మీపెద్దలు
మిమ్మందరమందలుగా, గుంపులుగా
చేరగొట్టి, ఊర్లనుపొందించినారు.
ఆభయమూ, ఆదిగులూ ఇంకా కొన్నాళ్లదాక మిమువీడదు.
ఇంకాకొన్నాళ్లదాక ఈగోడలు మీఇండ్లనుండి మీపొలాల విడదీయుచునేవుండును.

అర్ఫలీజు వాసులారా!
చెప్పుడు నిజముగ చెప్పుడు
మీఇండ్లలో మీరింతగ పాతిపెట్టుకున్నదేమి?
ఈతీరుగ తలుపులు తాళాలువేసి కాపాడుచున్నదేమి?

ఆఇండ్లలోశాంతి,
—మీశక్తుల బాహాటమ్మొనరించెడి మేనప్రేరణ—కలదా? ఉన్నదా?
ఆ ఇండ్లయందు స్మృతులు;
—కల్పన శిఖరాలవరకు మార్గమంతవెలయుచున్న సింగిణీలు—కలవా? ఉన్నవా?
ఆఇండ్లలో సౌందర్యము;
—కర్ర, మన్ను, రాయి, ఇనుము సామగ్రినుండి విడదీసి
మీ హృదయాలను పవిత్రమైన కొండలకొసలకడజేర్చెడి సౌందర్యముకలదా?
చెప్పుడు ఇదిఅంత మీఇండ్లలో వున్నదేమోచెప్పుడు.
లేక అచటవున్నట్టిది కేవలము—సుఖము—సుఖలాలసేన?
ఆ లాలస పచ్చిదొంగ;
అతిథివోలె, ఇంటజొచ్చు.
అది మారును గృహమేధిగ.
అటుపిమ్మట దొరమాదిరి
పెత్తనాలు సాగించుచు
మిము తొత్తులుగా జేయును,
ఇంతెకాదు, ఆలాలస
జంతువులను మోదిమెతుపు 'రింగుమాస్టరు'కైవడి
మీ గొంతెమ్మకోర్కెలను, కొరడాతో బెదిరిస్తూ
ముల్లుకర్రతోపొడుస్తు తైతక్కలాడించును
పిల్లి మొగ్గలేయించును
మీరు దానిచేతులలో కీలుబొమ్మలైపోదురు.

దానిచేతివేళ్ల పట్టుకుచ్చులేకానీ, దాని ఎడద పాషాణము
అదిమిమ్ముల లాలించును పాలించును జోకొట్టును.
మీ సెజ్జలకడ నిలిచివుండి, మీపై మీశరీరాల ఆధిపత్యముజూచుచు
నవ్వుచుండు లోలోపల.
మీ ఇంద్రియాలబలము, బుద్ధి, రూపుమాపి తలవంపులపాలుజేసి
మిమ్ముల దూదిపింజలట్లు ఏకిపారేయును.
అది మీసద్బుద్ధిని పచ్చికుండవలెచితిపి ఆవల పారవేసి వెక్కిరించు.
సుఖలాలస మీఆత్మశక్తి మెడనులుముట తథ్యము.
నిశ్చయముగ సుఖలాలస ఆత్మావేశాలజంపు,
ఆతదుపరి యిగిలిస్తూ ప్రేతయాత్రలోపాల్గొను.

కానీ; ఓ అంతరిక్షశిశువులార!
హాయిగనున్నపుడుకూడ తహతహపడు జీవులార!
మీరు సుఖలాలస ఉచ్చులలో చిక్కుకొనరు.
దాని పంజరాన పట్టుబడరు. దానికి మచ్చికకారు.
మీఇల్లు మీకులంగరౌచు మిమ్మాపక,
అది తెరకొయ్యగ ఉపకరించుగాక.
మీగాయాలను దాచునట్టి మందులోనానిన పువ్వత్తిగాక
మీఇల్లుమీకు కన్నునుకాపాడునట్టి రెప్పవోలె వుండుగాక.
తలుపులు యిరకటమని, మీరుమీరెక్కల ముడుచుకొనరాదెప్పుడు
ఎత్తుకాని కప్పును తలగ్రుద్దుకొనునను భయముతో
తలను వంచరాదెప్పుడు.
పేకమేడవంటిఇల్లు కూలిపోవునేమోయని,
ఊపిరిపీల్చగ వదలగ మీరెప్పుడు జడియరాదు.
చచ్చిపోయినట్టివారు బ్రతికివున్నవారలకని కట్టినట్టిగోరీలగు
మీ ఇండ్లలో మీరెప్పుడు వుండరాదు.
ఎంతభవ్యమైనదైన ఎంతఅందమైనదైన
ఇల్లెప్పుడు కాజాలదు ఆశ్రయము
మీ నిగూఢతత్వానికి, మీఅమోఘమగు తృష్ణకు.
ఏలన:
ఆకసపు హర్మ్యనమాత్రమే మీఽనంతత్వము నిలువజాలును
ఆ హార్మ్యపు ద్వారంబులు తొలిసంజలమంచుతెరలు.
నిశాదేవి మధురమధురగీతాలు ఆ హార్మ్యగవాక్షాలు.

అంతటనొక సాలెవాడు, ఉడుపుల గూరిచి అడుగగ
అల్ముస్తఫ పలికెయిటుల—

మీ ఉడుపులు దాచివుంచు, మీ యొడలి అందాలను—
కానీ— అవిదాచలేవు మీ వికృతరూపాలనెపుడు.
అవయవాలు స్వేచ్ఛతోడ కదలాడగ,
మరుగుకొరకు బట్టలకప్పులు ముసుగులు
మీరు వేసుకొనుచుందురు.
కానీ, ఆముసుగులే, జీను, కళ్ళెము, కట్లుఅయి,
మీ అవయవాల బంధించును.
ఎండ, గాలి మీరుతొడిగిన బట్టలనుగాక
నేరుగ మీ శరీరాన్నె తాకుచున్న ఎంతోబాగుండెడిది.
ఏలనో:—
బ్రతుకు ఊపిరి కలదు, సూర్యుని రశ్మియందు
జీవనచైతన్యశక్తి ఒలికించెడి దివ్యకరము గాలివిసురులోనకలదు.
మీలోకొందరు అందురు—
'చలికాలపు యీదరయే యీబట్టలు నేసెను' అని
నేనుకూడ అంటాను, మీబట్టలను నేసినది చలికాలపు యీదరయే అని
కానీ,
మీ యొడలిపైభాగపు సౌకుమార్యమను నూలుతో,
మీసిగ్గను మగ్గముపై
ఆ యీదర బట్టలన్నినేసి—తాను అడవిచేరి
పకపకనవ్వుచు తిరుగును మీ అవస్థలనుజూచుచు.
శీలము:—పాపపుచూపుల తూపుల నడ్డుకొనగ
డాలు మాత్రమేయని మరువకుడు.

పాపియెవడు లేనప్పుడు, శీలము వ్యర్థమేకాదు
అది ఆత్మహత్యకై తోడ్పడు పురితాడు,
అది స్వంత మనసులోనికుళ్ళు
ఇంతేకాదు, యీ మాటకూడ మరువకుడు
పుడమితల్లి కానందము మీ బరికాళ్లు,
ఆమెయెడద తాకినవుడే,
గాలియెపుడు తహతహపడు, మీ శిరోజాలతోడజేరి ఆడుదమని.

ఒక వర్తకుడు,
క్రయవిక్రయముగురించి ప్రశ్నింపగ
అల్ముస్తఫ ఇట్లనె:—

పుడమి తనసంపదంత అర్పించును మీకుఎపుడు.
దోసిళ్లను నింపుకొనుటయెటులో మీరెరిగివున్న
కొరతన్నది మీకుండదు
పుడమి ఒసగు కానుకలను ఇచ్చిపుచ్చుకొనుటలోనే
ప్రతివస్తువు మీకుదొరుకు సమృద్ధిగ.
దానిఫలము సంతృప్తి,
కానీ ఆఇచ్చిపుచ్చుకొనుట,
ఆ కానుకలవాయినాలు,
ప్రేమమయము కాకుండిన,
న్యాయముగా జరుగకున్న,
అదికొనిపోవుకొందరిని అమితాశవైపు,
మిగిలినవారినందరినదిపడద్రోయును,
లేములఇడుముల, ఆకలిమంటల.

మీలోనే; సముద్రాలసంపదలను వలలనింపుకొన్నవారు:
పుడమిని పండించి పంటగంపలకెత్తినవారు,
'మీరందరు సంతలోన' చేరినపుడు; అచటమీవలెనె
శ్రమలకోర్చి అవసరమగుసరకులను సిద్ధపరచి
తెచ్చినట్టిసాలెవారు, కుమ్మరులు, కమ్మరులు,
కార్మికులు, శిల్పకళానైపుణ్యులు, దేశదేశములు
తిరిగి వివిధవస్తుసామగ్రిని సేకరించిఏతెంచిన
వర్తకులు గుమిగూడినపుడు:—
పరస్పరము మీ అవసరాలబట్టి పుడమికానుకలను,
ఇచ్చిపుచ్చుకొనకముందు,

మీకొలతలను, తూకాలను,
వస్తువుల పరస్పరవిలువలను.
న్యాయబద్ధమొనరింపగ;
విశ్వాత్మనుసాక్షిగ ఆవాహనముచేసికొనుడు.
ఉత్తచేతులతోవచ్చి మీకష్టార్జితములను తమ
మాటలమ్మికొనదలచెడి మధ్యవర్తులెవరైన,
అచట మీకు ఎదురుపడిన,
వారితోడ మీరెవ్వరు వ్యవహారము చేయకుడు.
ఆ సోమరులకు మీవ్యవహారమునందు జోక్యము
కలుగజేసుకొనెడి శ్రమయివ్వకుడు.
వారితోడ మీరనుడు.
మాతోపాటువచ్చి పొలములలో కష్టించుడు
లేదా, మీసోదరులతో సంద్రమందు వలవిసురుడు.
పుడమియైన, సంద్రమైన, మాకువలెనేమీకుకూడ
తమకడనున్నట్టి నిధులనర్పించును.
ఆసంతలోనే పాటలుపాడెడివారు, ఆటలు ఆడెడివారు పిల్లనగ్రోవివూదెడివారు
ఏతెంచిన—వారికానుకలనుసయితము మీరుకొనుడు.
ఏలన—
వారుకూడ మీవలెనే ప్రకృతిమాత సంపదలను,
శ్రమలోర్చి, సేకరించినట్టివారే, వారుతెచ్చుసామగ్రి,
స్వప్నజగత్తుదైనను, భావాత్మకమైనదైనను
అయ్యదియే మీఆత్మలకాహారము పరిధానము.
మీరు సంతవిడిచిపోవునపుడు, అచటనుండి ఏఒకడును
వట్టిచేతులతో వెళ్ళిపోకుండగచూడుడు.
ఏలన—ఎంతపనికిమాలినట్టి వాడైనను,
కావలసినదిపొంది మీవలెనే సంతుష్టుడు కాకుండునో
అంతవరకు విశ్వాత్మకు శాంతిలేదు,
అంతరిక్షమందు జగద్రక్షకుడు
శాంతితోడ తేలియాడలేదు.

అంతనట—
అర్ఫలీజు పట్టణపున్యాయసభకు చెందినట్టిన్యాయాధీశుండు ఒకడు
నేరము—శిక్షనుగురించి చెప్పుమనిన
ఇటులపలికె అల్ ముస్తఫ.

మీ మనసు పట్టుదప్పి సంచరించుచున్నప్పుడు
మీరేకాకిగ వర్తింతురు.
అట్టితరి మీరితరుల కపకారము చేయుదురు.
నిజముచూడ
ఆ అపకారము మీకుమీరు చేసుకొనుటె.
ఏలన
ఆ అపకారము కారణాన
ముక్తిద్వారబంధముకడ మీరుచేరి తలుపులను తట్టినను
ఎవ్వరు వినిపించుకొనరు—తలుపులేవి తెరచుకొనవు.
కొంతవరకు మీముక్తికి ఆటంకముగానిలుచును ఆ అపకారము

మీలోని ఈశ్వరాంశ సాగరమునుబోలివుండు.
అది మలినము కాదెప్పుడు
రెక్కలున్నవారినెల్ల అది ఆకాశముపైనెగిరించును.
మీలోని దివ్యాంశము సూర్యునివంటిదికూడ,
అదియెరుగదు చుండెలుకల చీకటిత్రోవలు
అది అనుసరింపలేదు పాములపుట్టలసందులు.
కానీ, మీలోనున్నది దైవాంశంబొకటేకాదు.
మీలోఎక్కుడుభాగము ఇంకను మానవుడే.
ఇంకాఎంతోభాగము మనిషికూడకానట్టిది.
మంచుపొరలమధ్యమధ్య తనమేల్కొలుపును వెదుకుకొనుచు
నిద్రలోనే నడచుచున్న వికృతము ఆమరుగుజ్జు
నేనిప్పుడు పలుకునది మీలోనిమానవుని విషయమేను.

ఏలన—
మీలోని ఈశ్వరాంశకైన, మరుగుజ్జుకైన
ఎరుకలేదు నేరము—శిక్షలసంగతి.
అదితెలియును మానవమాత్రునకే
మీలోని మానవునకే.

తప్పుచేసినట్టివాడు మీవాడుకానట్లు
మీకందరికి పూర్తిగాఅపరిచితుడు అయినట్లు
ఎవడో ఒకపాపి, పిలవనిపేరంటముగావచ్చినట్లు
మీరు మాటలాడుటనేవింటిని.
పరమపవిత్రుడు, మహాపుణ్యాత్ముడు ఎవడైనను.
మీలోనిదెవాంశముయొక్క ఔన్నత్యముకన్న పైకిపోజాలడు.
ఎంతటిదుర్మార్గుడైన, పతితుడైన
మీలోనిమరుగుజ్జు నీచత్వముకన్న క్రిందికిదిగజారలేడు.
చెట్టంతయు మౌనముగా ఎరుగనిదే
మార్పులకు గురికానిదే,
ఏ ఆకుగూడ పండుటాకుగా మారదు, రాలదు.
అదేతీరుగ సంఘము, సంపూర్తిగ ప్రచ్ఛన్నముగానైనను
సంకల్పముచేయనిదే,
ఏఒక్కడు నేరముచేయలేడు,

ఊరేగెడిగుంపువోలె మీరందరు మీయందలి
దైవాంశమువైపు కదలిపోవుచుందురు.
మీరు యాత్రికులేకాదు, యాత్రకూడమీరేను,
మార్గమధ్యమందు జారిపడెడివాడు,
వెనుకవచ్చువానికొరకు పడును.
"పాకుడువున్నది తమ్ముడ! భద్రము" అని
అంతెకాదు, వాడుపడుట ముందుపోయినట్టివానికారణాన.
ముందువెళ్ళినట్టివాడు. పాకురుకడ జాగ్రత్తగ అడుగులిడుచుదాటి వెళ్ళిపోయినాడు
కానిఅతడు దానిలోనిపాకుడు తొలగించలేదు,

వినుటకు కష్టముగానున్నను, ఈమాటకూడ వినుడు—నిజముకాన
హత్యకు గురియైనవాడు
స్వయముగ తనహత్యకు బాధ్యుడుకాడన వీలులేదు.

దోపిడికిగురియైనవాడు స్వయముగ
జరిగినదోపిడి విషయము దోషికాడనవీలులేదు.
పుణ్యాత్ములు పాపాత్ముల పాపాచరణమునందున
ఏపాపము ఎరుగనట్టివారనుటకు వీలులేదు.
హంతకుడు, చంపబడినట్టివాని దుర్వర్తనకు గురియైనట్టివాడె
నేరస్థుడు నేరమునకు గురియైనవాని—
దౌష్ట్యమునకు లోనైనవాడె
పాపియని, పతితుడని పిలువబడుచు,
సంఘములో "ఛీ" "తూ"లకు గురియైనవ్యక్తి
నిజముచూడ పుణ్యాత్ముల పాపాలను మోయుచుండు.

న్యాయాత్ముల అన్యాయముచేయువారినుండిగాని
మంచివారిని చెడ్డవారినుండిగాని
విడదీయగ వీలుకాదు మీకెప్పుడు.

బట్టలోని తెల్లనల్లపోగులవలె
పగటివెలుగులో కలిసిపోవు గుంపువోలె మీరుందురు.
నల్లదైనను పోగుతెగినప్పుడు
సాలెబమ్మ పడుగు పేకంతయు వెతకిచూచు.
అంతెకాదు, మగ్గమందు యేదైనను లోపమున్నదేమొ అని
దానినిసహితము సరిచూచుకొనును.
మీలోనెవడైన
విశ్వాసఘాతకియగు ఒకభార్యను న్యాయస్థానముయెదుట నిలుపునపుడు
అతడు—ఆపాతకి పతిహృదయంబుకూడ
ధర్మకాంటపైతూచవలెను.
దానిహెచ్చుతగ్గులను సహితము,
నేరస్తురాలి 'ఆత్మను కొలచిన కొలబద్దతోనె' కొలువవలెను.
ఆవిడను కొరడాతో కొట్టువాడు
అభియోగము తెచ్చినవాని అంతరాత్మనుసైతము పరీక్షించి చూడవలెను.
ధర్మరక్షణార్థంబని, పాపులశిక్షించుటకై
గొడ్డలెత్తి చెట్టుమొదలునరుకునపుడు
ఒకమారు భూమిత్రవ్వి దానివేరులను చూడవలెను,
అతనికచట కనుపించును:—

పుడమిగర్భమందు, మంచి చెడ్డ, పండ్ల, ముళ్ళ
చెట్లవేరులన్ని కలసిమెలిసి
ఒకటినొకటి పెనవేసుకొని మనుచుండుట.

న్యాయముచేకూర్చు ధర్మమూర్తులార!
ఆచరణమువరకు ఏపాపముచేయడొకడు
కాని ఆంతర్యమునందు వాడుపచ్చిదొంగ
అట్టివానివిషయమందు మీనిర్ణయ మెటువంటిది?
ఇంకొకడు, కాయముతోవున్నవాడు
ఆకాయము సాయముతో ఇంకొకనిని హత్యచేయు
కాని వాడుస్వయముగానే ఆత్మహతుడు.
మనసుచితికి నట్టివాడు,
వానిని, మీరేశిక్షకు గురిచేతురు?
ప్రత్యక్షాచరణమందు ఒకడుమోసగాడు, దౌర్జన్యపరుడు
కానీ, వాడింతవరకె మోసాలకు గురియైనవాడు.
ఇతరులదౌర్జన్యాలవలన చితికిపోయినట్టివాడు
వానిపైన మీరుమోపు అభియోగపు రూపమెద్ది?
చేసినతప్పునకుమించిన పశ్చాత్తాపమునకుగురియై
నలిగెడివానిని, మీరేతీరుగ శిక్షింతురు?
ఏన్యాయము వొనగూర్చగ, ఏధర్మము పాటించగ
మీరు ప్రయత్నించుచున్నారో,
యేన్యాయము జరిగినచో మీరు సంతృప్తినిజెందుదురో
ఆ న్యాయమే, ఆధర్మమే
నేరస్థుని, పాపిని, పశ్చాత్తాపాగ్నియందు, కాల్చుచుండు,
ఇంతకూ, తప్పుచేయనట్టివాని నెవనిని
మీరు పశ్చాత్తాపాగ్నియందు పడద్రోయగలేరుకదా!
అదే తీరుగ,
పాపిని, మీరేవిధముగను,
పశ్చాత్తాపాగ్నినుండి బయటికి తీయలేరుగద?
పశ్చాత్తాపమువచ్చును పిలువకుండ
ఎవ్వరులేనట్టివేళ, ప్రత్యేకముగా రాతిరిసమయమందు
తప్పిదముచేసినట్టి వారికడకు,

వారి నిజరూపము, భయానక స్వరూపము
వారు మరచిపోదలచినట్టి వికృతాకారము
"చూడు! చూడు!" మని వారిని పొడిచిచూప
పశ్చాత్తాపము వచ్చును.

అన్ని అంశములు వెలుగులోనికిరాకుండనే
న్యాయముచేకూర్చుటెట్లు, న్యాయము ఎరిగినవారు?
అభియోగము తెచ్చువాని, మరియు
అభియోగము మోపబడినవాని
రహస్యాలు, చాటుపనులు బట్టబయలు కానప్పుడు
పుణ్యాత్ముడు, . పాపాత్ముడు అను నిర్ణయము జరుగుటెట్లు?

ఒకవేళ—మనఅందరిపనులన్నియు, ఉద్దేశ్యములన్నియు బైటపడిన—
మనకు తెలియవచ్చుమాటేమన—
అందరము మనలోని దైవాంశము, మరుగుజ్జుతనము మధ్యన
నిలిచివున్న వారలమని.
మానవమాతృలమని.
అంతెకాదు.
అందరమూఒకటేయని,

గుడిపునాదిరాయికంటె, గోపురానవున్నరాయి
గొప్పదేమికాదు. గుడిరాయే ఏదైనను.

అప్పుడొక న్యాయవాది
"శాసనాల సంగతియేమిటి?" యన
ఇటులపలికె అల్‌ముస్తఫ.

శాసనాలు చేయుటయన మీకెంతో సరదా
వాస్తవములో చేసిన శాసనాల నుల్లంఘించుటలోనే మీకెక్కువమజా,
సాగర తీరాన ఇసుకలోన ఆడుకొనెడి బాలురవలె మీవర్తన.
హడావుడిగ, ఎంతో ఏకాగ్రతతోడవారు, కట్టుదురు
వుసికెతోడ, కోటలు బురుజులు,
అంతలోనె, వానినిచేతులారపడద్రోసి,
తమకాళ్ళనె, తమయెదుటనె, కూలదన్ని,
ఫక్కున నవ్వుదురు, వికటాట్టహాసముచేతురు.
మీరొకచో ఇసుకతోటి, బురుజులుకోటలు కట్టగ
సాగరము తీరంబున చేర్చుచుండు, మరింతవుసికె.
మీరు మీ కట్టుకున్న శాసనాల కోటలను,
కూలద్రోసి నవ్వినపుడు,
కడలికూడ మీతోడనెకలసి నవ్వుచుండునెపుడు.
నిజమే! సాగరమునవ్వుచుండు ఎల్లప్పుడు,
అమాయకులతో జంటగాను.

కానీ, ఎవరికైతే, జీవనము కడలికాక, గండుశిలయొ,
శాసనాలు—ఆటలకని ఇసుకతోటి కట్టుకొన్న
కోటలు, బురుజులుకాక,
జీవనపుగండు శిలను యిష్టమువచ్చినయట్టుల
తొలచుటకు, నచ్చినరూపము యిచ్చుటకు
ఉపకరించు ఉలి సుత్తెలో—వారిసంగతేమిటి?
నర్తకులను ద్వేషించెడి వికలాంగుల సంగతేమిటి?
అడవిలోని, దుప్పిని, కుందేలును, విచ్చలవిడిగాతిరిగెడి
రౌడీలుగా భావించెడి

కాడికిలొంగిన ఎద్దుసంగతేమి?
కూసమును పగులజీరి, బైటపడి,
గాలివరుగులతో ఉరుకులాడు పాములను
బరిబాతగ తిరిగెడి, సిగ్గుమాలిన ప్రాణులనెడ
కూసము వీడలేని ముసలిపాము సంగతేమి?
పెండ్లివిందు సమయమునకు ముందేవచ్చి,
దిట్టగదిని, త్రేనుస్తు బైటపడుచు—
ఆనందముతో విందును ఆరగించు యితరులను
ఏవగింపుతో చూచుచు;—
విందులన్ని—మితాహార నియమములను భంగపరచు నేరములని
అతిథులంత సభ్యతపాటించని పోకిరులని
అనెడివారి సంగతేమి?
వారంధరు సూర్యునివైపు వీపుపెట్టి నిలిచివున్నవారు,
అని చెప్పుటకన్న, ఇంకేమి చెప్పగలను నేను.
వారు చూడగలిగినది తమతమ నీడలనే!
ఆ నీడలే వారు నిర్మాణముచేసుకొన్న శాసనాలు.
వారి దృష్టిలో, సూర్యుడు, కేవలము నీడలుపడవేయువాడు.
ఇక—శాసనాల మన్నించుటయన,
నేలపైకివంగి, బోర్లబొక్కలపడి, తమనీడలకు గిరిగీయుట.
దానిబైటపడుటయన, నేరంబని, పాపంబని, భావించుటగాక మరియేమిటి?
సూర్యునివైపే మొగమిడి, నడచునట్టివారలకు
ఏ నీడలు అడ్డురావు.
గాలివెంటవెంట తిరుగాడెడి ప్రయాణీకుల
యాత్రను నిర్దేశించే దిక్సూచియేదికలదు?
మీరు మీసంకెళ్ళను త్రెంచుకొన దలచినపుడు
వానిని, మరియొకని సంకెళ్ళను తెగగొట్టునట్లు చేయకున్న,
మానవుడు నిర్మించిన ఏశాసనము మిమ్ముల నాపగలదు?
మీ మెడపై కట్టియున్నకాడిని,

దించుకొనునపుడు, దానిక్రింద వుండనెంచు
మరో ప్రాణిమెడకు వురికాకుండిన
మానవశాసనమేది మిమ్ము ఆపగలదు.
మీరు చింపిపారవేసినట్టి మీపైబట్టలు
మరొకనిదారికి ఆటంకముగాకున్న
మిమ్ముకోర్టుబోనుకెక్కించెడి వాడెవ్వడు?
అర్ఫలీజు వాసులారా!
మీరు మీమృదంగాల పలుకకుండ చేయగలరు
మీ వీణలతీగలన్ని త్రెంచిపారవేయగలరు
కాని—ఆకసమున విహరించుచు,
తియ్యని పలుకులు పలికెడి,
చిలుకలను ఎవ్వడాపగలడు.

అప్పుడొక వక్త
స్వాతంత్ర్యమ్మన యేమిటో చెప్పుమనిన—
ఇటులపలికె అల్ముస్తఫ.

"బైట పురద్వారము కడ, ఇంట చలికుంపటికడ
మీరు మీస్వాతంత్ర్యంబును సాగిలపడి పూజించుట నేచూచితి.
ఊరకనే శిక్షించెడి, తలచినచో తలనరికెడి,
నిరంకుశుడు, దుష్టుడు, దౌర్జన్యపరుడునగు ప్రభువుచెంత
ఆత్మవంచనకులోనై, వంగి, నంగి మెదలు నట్టి
బానిసప్రాణులవలె, మిమ్ముల ఇంటబైట
మీ స్వాతంత్ర్యంబును సాగిలపడి పూజించుట నేచూచితి.
అంతెకాదు, నేజూచితి గుడితోటల—
కోటల గోడల నీడల—మీలోని సర్వతంత్ర స్వతంత్రుణ్ణి.
తన స్వాతంత్ర్యంబును, కాడిపోలె మెడదాల్చుట,
చేతిబేడీలుగ ధరియించివుంట, నేజూచితి.
అదిగని, నాహృదయము— నాజంటగరక్తధారగనేడ్చెను.
ఏలన—
స్వాతంత్ర్య వాంఛకూడ ఒకరకమగు బంధనమని ఎంచినపుడె
మీరు నిజముగ స్వతంత్రులు కాగలరు.
స్వాతంత్ర్యమే లక్ష్యంబని, గమ్యంబని, ఎలుగెత్తుట మానినపుడె
మీరు సర్వతంత్ర స్వతంత్రులు.

మీపగళ్ళు ఎట్టి దిగులు లేనట్టివి కానప్పుడె
మీ రాత్రులు, ఏకోర్కెలు, ఏదుఃఖము లేనట్టివికానప్పుడె,
మీరు పరతంత్రులు కాకుండవుండగలరు.
ఆదిగుళ్ళు, ఆకోర్కెలు, ఆదుఃఖము
మిమ్ముల కార్యాచరణకు సంసిద్ధులచేయుటకై
నడికట్టుగవుపకరించు.

అంతెకాదు—మీరు వానిని అణగద్రొక్కి
వున్నబంధనాలు త్రెంచుకొని, పైకెగసి
ఆత్మశక్తివిభవముతో వీరవిహారము చేయగలరు.

మీరుపుట్టినపుడే, మీయెరుక ప్రొద్దుపొడిచినపుడె
మీజీవిత మధ్యాహ్నమును, కట్టివుంచ, కట్టుకొన్న
సుడులు, ముళ్ళు, సంకెళ్ళు త్రెంచిపారవేయనిదే,
మీరు స్వతంత్రులు కాజాలరు.

మీరు రక్షించెడి స్వాతంత్ర్యము, యీ చిక్కులు ఇక్కట్టులలో నొక్కటి
అన్నిబంధనములకన్న గట్టిది, దానిని త్రెంచుట అతికష్టము.
ప్రచారాల వెలుతుర్లలో, స్వాతంత్ర్యపుసంకెళ్ళు
మెరయుచు మిరుమిట్లుగొలుపు.

స్వాతంత్ర్యముపొందుటకై మీరు త్రెంచవలసినట్టి బంధనాలు
వాస్తవముగ మీరు తెచ్చిపెట్టుకొన్నట్టివే!
మీలోనివే
మీ వ్యక్తిత్వములోచేరిన అంశములే,

ఏ శాసనము అన్యాయము చేకూర్చెడిదని,
మీరిప్పుడు రద్దుచేయదలచినారో
దానిని ఇదివరకు, మీరే మీచేతులార నొసటవ్రాసుకున్నారు.
న్యాయశాస్త్ర గ్రంథమ్ములను, తగులబెట్టిననూ
మీరు దాని రూపు మాపలేరు.
న్యాయాధీశులనొసళ్ళ, సాగరజలమును సాంతము
కుమ్మరించి కడగినను, మీనొసళ్ళవ్రాసుకొన్న
వ్రాతలేవి చెరిగిపోవు.
నిరంకుశుడు, హింసకుడు, అయినట్టి ఏలికను
పదభ్రష్టుని చేయుటకుముందు,
అతనికై మీరు మీహృదయమందు నిర్మించిన
సింహాసనమును, పెకిలించి, పారవేయుడు.
అభిమానధనునిపైన పెత్తనాలుసాగించెడి
సత్తాకలవాడెవ్వడు?

మీ స్వాతంత్ర్యము హింసాత్మకము కానప్పుడు
మీశీలము కళంకితము కానప్పుడు
ఏశక్తియు మిమ్ముతొలంగదీయలేదు.
స్వాతంత్ర్యముపొందుటకని,
మీరు బాపుకొనదలచిన దిగులుఏదైనను,
మీరుతెచ్చిపెట్టుకొన్నట్టిదే.
పరులెవరును, ఆదిగులును, మీమనసుననాటలేరు,
మీరు పోగొట్టుకొనదలచిన భయమేదైనను
అది మీగుండెలో, తిష్టవేసుకొనివున్నదే.
ఇతరేతరశక్తికట్టదు దానికిపట్టము.

మీరు కోరునది, భయపడునది, ఏవగించుకొనునట్టిది,
ఇష్టపడునట్టిది వెంటబడునది తప్పించుకొనదలచునది,
ప్రతిదీ మీలోనేవున్నది.
కలసిమెలసి, ఎత్తువంపులవలె, వెలుగునీడలవలె
ఇవియన్నియు మీలోపలజంటగ మొదలుచుసుండును.

ఒకనీడతొలగిపోవ, తొలగనట్టిఒకవెలుతురు,
మరోవెలుతురునకు అడ్డునిలచి, నీడల పారాడజేయు.

స్వాతంత్ర్యము కొరకు మీరు,
వున్నబంధనాల త్రెంచుకొన్న మరుక్షణమున
లభ్యమైన స్వాతంత్ర్యమే—
అంతకన్న దివ్యమైన స్వాతంత్ర్యమునకు బంధనమై బిగిసికొనును.

అప్పుడు ధర్మోపదేశిక ఒకర్తు
"వివేకము, ఆవేశమును" గూర్చియడిగిన
ఇటుల పలికె అల్ ముస్తఫ.

మీ వివేకానికి, ఆవేశానికి, మీ ఆంతర్యమునందు సాగుపోరాటము యెల్లప్పుడు.
నేను మధ్యవర్తినగుచు, ప్రకృతిసిద్ధములైన మీతత్వములకు
మైత్రిచేకూర్చగలిగిన ఎంతో సంతోషించెడివాడను.
కాని, ఎంతవరకు మీరుకూడ మధ్యవర్తులై నిలువరో
అంతెకాదు, ప్రకృతి సిద్ధమైన మీతత్వంబులనన్నిటినీ
ఒకేతీరుగచూచుట, ప్రేమించుట నేర్చుకొనరో,
అంతవరకూ నేనేమియు చేయలేను.
జీవన సాగరయాత్రను సాగించుచున్న మీఆత్మయనెడి నావకు,
మీ వివేకముచుక్కాని, మీఆవేశము తెరచాప.
చుక్కాని విరిగినచో గమ్యముఅన్నదిలేక
తిరుగులాడుగతి పట్టును.
తెరచాపలేకుండిన ఎటుకదలక,
నావ—ఒక్కచోటనే నిలుచును.
కేవలము వివేకమేపనిచేసిన,
కరుడు కట్టుగొనిపోదురు.
మీ జీవితము కుంటుపడును.
అది ముందుకుసాగలేదు.
వివేకము దారిచూపకుండినచో, ఆవేశము నిరుపయోగమై
తాటాకుమంటవోలెపైకెగసి, కాలికూలి ఆరిపోవు.
అందుచేత, మీ ఆత్మశక్తిధారబోసి
వివేకాన్ని, ఆవేశపు స్థాయికి కొనిపోవుడు.
వివేకాన్ని, ఆవేశముతో తాదాత్మ్యము పొందనిండు.
ఆస్థితిలో, మీవివేకాన్ని, ఆవేశానికి దారిచూపనిండు.
ఆవేశము, కాలి కూలి చల్లారినట్లు,

అది సతతము తనబూదినుండి తానేతిరిగి ప్రజ్వరిల్లునట్లు
ఆత్మచేత ప్రేరితమగు వివేకాన్ని
దానికి మార్గము చూపనిందు.

మీ వివేకావేశాలను, మీ అతిథులుగా యెంచుకొనుడు.
ఒక అతిథికి, మరో అతిథికన్న ఎక్కువ ఆదరణచూపకూడదను
విషయము మీరెరిగినదే.
అట్లుజేసినప్పుడు ఉభయుల కొంచెపరచుటయేఅగును.

కొండమీద చెట్లనీడకూర్చుని,
ప్రశాంతపరిసరాల హాయిననుభవించునపుడు
పచ్చనిబయళ్ళ, పంటపొలముల తిలకించునపుడు
మీరీతీరుగ అనుకొనుడు:—
"విరాట్ స్వరూపుడు, వివేకముతో వర్తించుచున్నాడు,"
మరోసారి, తుఫానులు తాండవాలు చేయునపుడు
లోకమంత ఉరుముల మెరుపుల ఆధిపత్యమునకులొంగి గడగడలాడునపుడు
మీమదిలో ఈరీతిగ అనుకొనుడు,
"విశ్వరూపుడు ఆవేశముతో గంతులిడుచున్నాడు."

విశ్వాత్ముని శ్వాసలోని ఒక్క అంశమైనమీరు
విశ్వరూపుని మహారణ్యములోని గడ్డిపోచయైనమీరు
వివేకముతో వర్తించుచు ప్రశాంతముగానుండుట
ఆవేశముతో మైమరచి గంతులేయుట
తప్పనిసరి.

అచటచేరియున్న స్త్రీలలోని ప్రౌఢఒకతె
"వేదన గూర్చిపలుక" మనిన
ఇటులపలికె అల్ ముస్తఫ.

పండునకున్నట్లే—
మీఎరుకను దాచెడి బెరడున్నది.
అది చిట్లి పగిలిపోవటమే వేదన.
ఫలహృదయము ఎండపొడతీపిని అందుకోవాలంటే
ముందుదానిబెరడు తప్పకచిట్లి పగిలిపోవాలె.
అదేరీతిగా మీరును, తప్పనిసరిగా వేదనను అనుభవించండి.

మీజీవితదైనందిన మహత్యాలకు
మీహృదయము అబ్బురపడునదిఐనప్పుడు—
వేదనకూడ ఒక అద్భుతమేయని మీకుతెలిసివచ్చును.

మీపొలాలు, మీతోటలు ఫలింప
వసంతాది ఋతువులున్నట్లే—తప్పనిసరిఅయినట్లే
మీహృదయవికాసానికి, సుఖదుఃఖాలు కలవని బోధపడును.
అప్పుడు, మీరు మీవేదనహేమంతాలలోకూడ
నిశ్చలమతులైవుంటారు.

వేదన చాలావరకు మీరు ఇష్టపూర్వకముగా తెచ్చుకొన్నదే.
మీలోనివైద్యుడు జబ్బుపడిన మీఅంతరంగాన్ని కుదుర్చుటకు,
తయారుచేసిన చేదుమందే ఆ వేదన.
ఆ వైద్యుని సంపూర్ణముగానమ్ముడు.
ఆ మందును మౌనముగా శాంతముగా సేవించుడు.

ఏలన—
బలవంతముగా మీచేత మందు త్రాగించేఅతనిచెయ్యి
కఠినమైనదీ, ఎంతో భారమైనదైననూ
దానికి చేదోడుగా, పరాత్పరుని కోమలహస్తమున్నది.
వైద్యునిచేతులలోని మందుకుప్పె
మీపెదవుల కాల్చునదైనాసరే, వగవకుడు.
ఏలన, కుప్పెరూపుదాల్చిన మంటిని
లోకపుసారెను త్రిప్పే కుమ్మరి తనకన్నీళ్ళతోతడిపినాడు.

అంతనొకడు—
"తననుతాను ఎరుగుటయేమిటి" అన
అల్‌ముస్తఫ ఇటులపలికె.

మౌనమందు మీఎడదలు రేబవళ్ళరహస్యాలు గుర్తెరుగును.
మీఎడదల రహస్యాల ఎరుకపలుకు విను పిపాసకలదు మీచెవులకు.
ఊహకు అందినదంతయు మాటరూపమునసైతము,
విశదముకాగలదుమీకు.
మీకలల నగ్నశరీరాన్ని సాక్షాత్తుగచేతులతో
తాకిచూడగలరు మీరు.

బావిగ బ్రతుకాలెమీరు.
మీఅంతరంగమునదాగిన వూటలన్ని ఎగజిమ్ముచు
పాడుచు, ఆడుచు, పరుగిడి,
కలియవలెను జీవితసాగరాన
అపుడు
అంతులేని అంతరంగ ఐశ్వర్యమ్మంత
మీ కనులముందు ప్రత్యక్షమ్మైనిలుచును.
కాని, తెలియని పెన్నిధిని జోకునట్టి
తక్కెడేదివుండరాదు.
అంతెకాదు,
గైల తోడ కెలికికాని, బరువుకట్టి నులకుండలవిడిచిగాని
మీ ఎరుక, లోతుజాడలరయ బూనకుడు.
ఏలన—
ఆత్మకూడ కడలివలెనే

అంతుపొంతులేనట్టిది, కొలతకు మించినయట్టిది.
'పరమసత్యము నేను కనుగొంటిని' అనకూడదు.
అంతకన్న, నేనొకసత్యమును కనుగొంటిని' అనవచ్చును.
'ఆత్మమార్గమును నేను తెలిసికొంటి ననరాదు'
అంతకన్న, 'నామార్గము ననుసరించివచ్చిన ఆత్మను నేకలిసితి' ననవచ్చును.
ఏలన—
ఆత్మప్రయాణముసాగును అన్నిమార్గములయందును.
ఆత్మఎపుడు ముక్కుకుసూటిగ నడువదు.
అది వెదురువోలె, నిటారుగా యెదుగదు.
ఆత్మవికసనము జరుగును,
లెక్కలేని రేకులుగల పద్మమువలె.

అంతనొక బడిపంతులు
విద్యాబోధనముగూర్చి ప్రశ్నింపగ
అల్ ముస్తఫ పలికె.

మీ ఎరుకప్రొద్దు పొడుపులందు
సగమునిద్రలోనవున్న మీ తెలివిని,
ఎవడైనను సంపూర్ణమ్ముగ మీకు
బోధపరుచు, వెల్లడించు.
ఇంకేదియు వెల్లడించజాలడతడు.

ఆలయఛత్రచ్ఛాయలో శిష్యులతోగూడి తిరుగు గురువెవ్వడును
తనజ్ఞానము ఆవంతయు ఏశిష్యునకీయలేడు."
అతడు పంచగలిగినది తనశ్రద్ధను, ప్రేమనుమాత్రమేను.
గురువు బుద్ధిమంతుడైన, అతడెప్పుడు,
మిమ్ముల తనజ్ఞానమందిరాన్నిచేరి
వుండుటకు ఆజ్ఞాపించడు,
అంతకన్న, మిమ్మాతడు వేలుపట్టుకునిచేర్చును,
మీ మనసుల ప్రాంగణాన.

ఖగోళశాస్త్రవేత్త యెవడును
తానెరిగిన దానిగూర్చి మీకుచెప్పగలడుకాని,
తనజ్ఞానము పిసరంతయు మీకు అందజేయలేడు.
గానకళాపరిపూర్ణుడు ఎవడైనను,
అంతరిక్షమంతనిండివున్న రాగతాళాలను
మీముందర ప్రదర్శింపగలడు కానీ
నాదమ్మును గ్రహియించెడి రసికత్వము ఏమాత్రము
మీ చెవికాతడు ఇవ్వలేడు.
నాదామృతమాధుర్యము లవలేశంబైనకాని
మీగాత్రము ధ్వనియింపగ చేయలేడు.

గణితశాస్త్రవేత్త ఎవడైనను
తూకమ్ముల, కొలతల నిర్ణయించి
ఇంతింతని వెల్లడించి
విభాగాల వైవిధ్యము చూపగలడు,
అంతెకాని, మిమ్మాతడు ఎత్తుకొనిపోజాలడు,
లెక్కలచిక్కులబాటల ఆవలిగమ్యాలవరకు.
ఏలన,—
సృష్టిరచనా వైచిత్ర్యము అటువంటిది,
ఒకనిచూపు ఎంతపాటి తీవ్రము, తీక్ష్ణము అయినను
దీర్ఘము, సూక్ష్మము అయినను
తనతీక్ష్ణత, తనసూక్ష్మత మరియొకనికి పంచిఇవ్వజాలడతడు.

విశ్వాత్మని జ్ఞానాంబుధియందు
మీరు వేర్వేరుగ అస్తిత్వముగలిగినట్టివారు కాన,
అతని ఎరుకకూడ, ఎవనిదివానిదిగనే వుండును.
అదేతీరు ఐహిక విషయముల ఎరుకకూడ.

ఒకయువకుడు, మైత్రినిగూర్చి యడుగ అతడనె.

నీమిత్రుడు నీతీరిన అవసరాలు.
అనురాగముతో సేద్యము చేసుకొనుటకును,
కృతజ్ఞతతో పంటనుకోసుకొనుటకును,
అనుకూలమైన, మీ స్వంతపొలమువంటివాడు మీమిత్రుడు,
వడ్డించిన విస్తరివంటివాడు మీ మిత్రుడు.
మీచలికుంపటి మీమిత్రుడు.
తపనకు పన్నీటి జల్లువంటివాడు మీమిత్రుడు.
ఆకలిగొన్నప్పుడు మీరతనిని సమీపింతురు.
అన్వేషింతురు అతనిని శాంతికొరకు,
మీమిత్రుడు మనసువిప్పి మీతోమాటాడునపుడు
'కానిది' కాదనుటకైన,
'అగునది,' అగుననుటకైన
సంకోచింపరు మీరు.
మౌనముగా అతడున్నను,
మీరాతని ఎదపలుకులు వినుచుందురు.
ఏలన,—
మాటలచేయూతఏమీ లేకుండనే
మైత్రియందు, వూహలన్ని, కోర్కెలన్ని
ఉద్భవించుక్షణములోనె ఒండొరులకు తెలిసిపోవు.
స్నేహములో, సహానుభూతి సహజమగుట,
అనుభూతుల ఆనందము జంటగానే జరుగుచుండు.
చాటింపులు ఏమిలేక, అద్వైతము సిద్ధించును.

మిత్రుని కడనుండి మీరు విడిపోయినపుడు కూడ
ఏమాత్రము ఖేదపడరు.

ఏలన,
మిత్రుని ఏగుణమును మీరెక్కువగ ప్రేమింతురో
ఆగుణమే ఎడబాటులో మరింతమీకు భాసించును,
అనుభూతిని చేకూర్చును.
కొండలోని గొప్పతనము, కొండఎక్కిచూచినపుడు కనిపించదు.
కొండదిగి, దూరముగా మైదానములో నిలిచిచూచువరకు.

మైత్రిలోన ఆత్మీయత విస్తారముతప్ప,
మరొక లక్ష్యమ్మేదియు వుండరాదు.
చెలిమి రహస్యాలలోని అద్భుతాల గనుటకన్న
వేరగు అభిలాషతోడ సాన్నిధ్యము గడియించుట;
చేపలకై వలవిసరుట,
ఆ వలలో చిక్కునది అతిక్షుద్రము,

మీలోనిది మీదైనది అతిముఖ్యంబైనట్టిది ఏదికలదో
అదిమాత్రము మీమిత్రునికొరకు మీరెల్లప్పుడు కాపాడుడు.
మీ బ్రతుకు కడలి 'ఆటు' నేతీరుగ
మీ మిత్రుని యెదుట పెట్టెదరో
అదేతీరుగ అతనిని మీ 'పోటు' ముంచెత్తనిండు.
కేవలము కాలక్షేపము కొరకై పనికివచ్చువాడెవ్వడు,
మీ మిత్రుడు కానెకాడు.
కాలమునకు అమరత్వము చేకూర్చుటకే
మిత్రుల సమాగమము,
మిత్రుడు మీఅవసరమును తీర్చునట్టివాడెకాని
మీ ఆంతర్యములోని వెలితి, పూరించెడివాడుకాడు.
మైత్రిలోని మాధుర్యము ఎల్లప్పుడు
మీయుల్లంబుల నవ్వులతో నింపుగాక,
సంబరాల విందుచేసి, ఉత్సాహమ్మొసగుగాక.
ఏలన,
ఆచిన్నపాటి అంశమ్ములపైరలోనే,—
మీ హృదయము తన తొలిసంజలపొంది చిగురించును.

అంతట నొక పండితవర్యుడు
"సంభాషణగూర్చి అభిభాషణచేయు" మనిన
ఇటుల పలికె అల్‌ముస్తఫ.

మీ ఆలోచనలతోడ మీకుపొత్తు పొసగనపుడు,
లంకె యేది కుదరనపుడు, మీరుమాటలాడుతారు.
మీ హృదయపు ఏకాంతమందు మీరువుండలేనప్పుడు
పెదవులలో బ్రతుకుతారు.
శబ్దము:— కాలముగడుపగ, వేడుక, ఆట, వినోదము.
మాటల చేంతాడుముడి, మీవూహల మెడకువురి.
(మాటగమారుటలోనే మీ ఆలోచన సగముచచ్చు)
ఏలన,
ఆలోచన అంతరిక్ష విహంగము
మాట పంజరాన అదిరెక్కలు తప్పక విప్పును
కాని, రంయ్యని ఎగురలేదు.
మీలోకొందరు తమతమ ఒంటరితనమునకు జడిసి
వదరుబోతులనుజేరి 'శరణు', 'శరణు' అనుచుందురు
ఏకాంతపు మౌనమెపుడు, వారికి ప్రత్యక్షపరచు
వారివారియాంతర్యములన్నిటిని నగ్నపరిచి
అందుకే దానిని వారు తప్పించుక తిరుగుతారు,
మాటలాడువారు కూడ,
ఎరుగక వుద్దేశింపక ప్రకటింతురు, సత్యమ్మును అప్పుడపుడు,
ఆ సత్యము అసలేమిటో వారికిసైతము తెలియదు.
మరికొందరు ఆంతర్యములో దాగిన
సత్యమ్మును గుర్తెరిగియు మాటలలోదానినెపుడు ప్రకటింపరు.
అట్టివారి యెదదల్లో విశ్వాత్ముడు నివసించును
మౌనతాళలయ గతుడుగా.
మార్గమధ్యమందైనను, సంతజరుగుచోటైనను

మీ మిత్రుడు మీకు ఎదురుపడినప్పుడు,
మీ అంతరాత్మ మీ పెదవుల ప్రేరేపించునుగాక
మీ జిహ్వకు మార్గముచూపుగాక.
అట్టితరి,—
మీ గొంతుకుగల గొంతుకను
అతనిచెవిలోపలి చెవితోడ
ముచ్చట తీరగ ముచ్చటింపనిండెప్పుడు.
ఏలన—
అతని అంతరాత్మ జాగ్రత్తగ భద్రపరచు
మీ అంతరాత్మ ప్రకటించిన సత్యమ్మును,
సేవించిన పానీయము మజావోలె—
పానీయము రంగురూపు జ్ఞాపకాల పట్టువీడిపోయినను
పానపాత్ర పేరుకూడ మాసినను
యాదుండెడి పానీయము మజావోలె.

అప్పుడొక ఖగోళశాస్త్రజ్ఞుడు
"కాలము" అననేమిటి అని ప్రశ్నింపగ
పలికెనిటుల అల్‌ముస్తఫ.

కొలతలేని కొలచుటకు వీలుకాని
కాలమును మీరెప్పుడు కొలుస్తారు
గంటలకు ఋతువులకు అనువుగాను,
మీ జీవన ప్రవాహాన్ని, మీ ఆత్మశక్తి విద్యుత్తును
అదుపులోకి తెచ్చుటకై యత్నింతురు,
అందుకు తగినట్లు మీరు మీనడవడిని, నైజమును సదురుతారు,
కాలమును, నదియనుకొని, దాని ప్రవాహాన్నిచూడ
గట్టుమీద కూర్చుందురు.
అయినా— మీలోనికాలాతీతమగు శక్తికి
జీవనము కాలాతీతమని సంపూర్తిగ గుర్తున్నది,
అది యెరుగును—
"నిన్న" నేటి స్మృతిమాత్రమెయని.
"రేపు" నేటి స్వప్నంబని.

మరియు మీలోనిది. పాటలు పాడేది,
చింతనచేసేది,—
చుక్కలు వెదజల్లబడిన క్షణమునుండి ఈనాటికి
ఆకాశములోనె నిలచివున్నది.

ఇంతకూ ప్రేమశక్తి, అనంతమ్మని ఎరుగనివాడెవ్వడు?
ఇట్లయ్యును ఆ ప్రేమయె తానెల్లలు ఎరుగనిదయ్యును,
మీ జీవితవలయాలచిక్కి, మర్యాదల పాటిస్తూ
కేంద్రబిందువై నిలచును, చైతన్యము కోలుపోయి.
అదిచేరలేదు, ఒకప్రేమ భావనను వదలి
మరోప్రేమ భావనకడకు,

అది చేబట్టలేదు, ఒక ప్రేమకలాపమును వదలి
మరో ప్రేమ కలాపమును.
ప్రేమకు వలెనే కాలము,
అఖండము, స్థలాతీతము కాదా మరి?
అయినా ఒకవేళ మీరు వూహాసామ్రాజ్యములో
కాలమును, ఋతువుల్లో కొలవ నెంచినచో—
ప్రతి ఋతువును అన్ని ఋతువులుకలదానిగ కొల్చుకొనుడు,
'నేటిని' స్మృతి విహ్వలమై గతదినమును కౌగలించుకొన జేయుడు
కలయిక తహతహతో దానినే 'రేపు' వైపు చేతులు జాచునట్లొనరింపుడు.

అప్పుడు ఊరిపెద్దలలో నొక్కడు
'మంచి—చెడు'లను గూరిచిచెప్పుమనిన
విని, అతడనె,

మీలోని మంచితనము గూర్చి నేను పలుకగలను
అంతేకాని, మీలోని చెడునుగూర్చి పలుకలేను.
ఏలన,
'చెడు' అనునది ఆకలిదప్పులకుగురియై
ఆరాటము పడుచుండిన మీ మంచితనమే కదా.
నిశ్చయమిది.
ఆకలిగొన్నట్టిమంచి, చీకటి మరుగుల మురుగుల మూతిడుట.
దప్పితోడ తహతహపడునట్టి మంచి,మురికిమడుగులోని నీటినిత్రాగుట.

మీ ఆంతర్యముతోడ మీరు ఏకరూపులై వుండగ మంచివారు.
అట్లుకానప్పుడుకూడ, మీరు చెడ్డవారు కానేకారు.
విడిపోయిన కుటుంబాలు, దొంగలగుంపులు కావు.
అవి, విడిపోయిన కుటుంబాలు మాత్రమేను.

చుక్కానిలేనిపడవ, ప్రమాదాలతోకూడిన సంద్రమందు
అటునిటు అల్లల్లాడును, అంతెకాని
మునిగిపోయి అడుగంటదు.
మిమ్మమీరితరులకై అర్పించుకొన్నప్పుడు, మంచివారు.
అంతెకాని, మీస్వార్థానికి ప్రాకులాడినపుడుకూడ
మీరు చెడ్డవారు కానెకారు,
ఏలన,
మీ స్వార్థానికి ప్రాకులాడుచున్నప్పుడు మీనడవడి
పుడమితల్లి శరీరాన్ని హత్తుకొని,
చన్నుకుడుచుచున్న చెట్టువేరువలెనుండును.

ఫలమెప్పుడు వేరుతోడ అనలేదు,—
"నీవుకూడనావలెనే నిండుగ నిగనిగలాడుచు,
నీసమృద్ధిని ఎల్లప్పుడు పంచిపెట్టుమందరి" కని.
ఏలన—
పండునకు 'ఇచ్చుట' అనునది అగత్యమైనట్లే
వేరునకు 'తీసుకొనుట' అట్లే అగత్యము.

పూర్ణజాగ్రదవస్థలో పలుకుచున్నప్పుడు, మీరుమంచివారు.
అంతె కాని,
నిద్రలో ఉద్దేశ్యమేమిలేక, నాలుక తడబడు పలుకులు పలికినప్పుడుగూడ,
కలవరించినపుడుగూడ, మీరు చెడ్డవారు కానేరరు.
తడబడు పలుకులు సహితము,
బలము లేనినాలుకకు అభ్యాసముచేకూర్చును.
మీ లక్ష్యమువైపు మీరు దృఢముగ పదములు నిడుచు
ధైర్యముతోనడుచుచున్న సమయమందు మీరుమంచివారు.
అయినా అచ్చోటికి, కుంటుచు, కాళ్ళీడ్చుకొనుచు పోయినను,
మీరుచెడ్డవారుకారు.
కుంటుచు, కాళ్ళీడ్చుకొనుచు పోవుచున్నవారుకూడ,
వెనుకకు పోవుటలేదు.
కాని, మీలోని దృఢపాదులు త్వరితగతులు
దయజూపుట, సానుభూతి కనబరచుటఅను భ్రమతో
కుంటివారి, అవిటివారిముందు, కాళ్ళీడ్చుకొనుచు నడువరాదు,

అనేక విషయములయందు మీరుమంచివారు.
మంచివారు కానపుడును మీరు చెడ్డవారుకారు.
ఆ కొలది విషయాలలోనమీరు
కేవలము పెండ్లినడక నడుచువారు, సోమరులు మాత్రమేను,
దుప్పులు తమచురుకుపరుగు తాబేళ్ళకు నేర్పలేకుండుట
శోచనీయమే నిజముగ

మీలోని అనంతత్వమును చేరుటకై
మీయందలి తహతహయే మీమంచితనము.
ఆ తహతహ మీయందరిలోను కలదు,

కాని మీలోని కొందరిలో ఆ తహతహ
దూకులుపెట్టుచు కడలివైపు పరుగులెత్తు మహానదివంటిది,
పర్వతపరిసరాల రహస్యాలు, మహారణ్యముల పాటలు
మోసుకొనిపోవుచుండును అది.

మరికొందరిలోన, ఆ తహతహ
ఓ చిన్న సెలయేరువలె, పిల్లవాగువలె నుండును.
అది అడ్డంకుల నెదుర్కొనజాలదు.
అటునిటుపారాడి, ఆగుచు పారుచు,
ఎచటనో సాగరమును చేరకముందే ఇంకిపోవు.

బలవత్తరమగు తహతహ కలవాడు
బలములేని తహతహగలవాని నెపుడు అడగరాదు,
'నీవు మెల్లగ, ఆగుచు నెమ్మదిగా పారాడుట ఏల?' అనుచు,
ఏలన,—
మంచివారు, బరిబాతగ తిరుగువాని నడుగరెపుడు,
'నీముస్తాబెక్కడ?' అని.
ఇల్లులేక తిరుగువాని ప్రశ్నింపరు,
' నీకొంపకేమి మూడిన?' దని.

ఆ తదుపరి ఒక ఉపదేశిక,
'ప్రార్థన విషయము చెప్పుమాకొకింత' అని అడిగిన,
అతడిట్లనె.

దుఃఖితులై వున్నప్పుడు, అక్కర తీరనియప్పుడు,
ప్రార్థింతురు మీరందరు.
అదేరీతిగా మీరు, సుఖవంతులు అయినప్పుడు
కలిమిగలిగివున్నప్పుడు, ప్రార్థనచేసిన ఎంతో బాగుండెడిది.
ఏలన,—
ప్రార్థించుటయన, బ్రతుకుతోడ చిందులాడు
అంతరిక్షమందుచేరి, మిమ్ముమీరు విస్తరింపజేసుకొనుట.
హాయిపొంద, సుఖముచెంద, మీ ఆంతర్యపు చీకట్లను
అంతరిక్షమందంతట, మీరువొలకబోసుకున్నట్లే
ఆనందము పొందుటకు, సంతుష్టిని చెందుటకు,
మీ ఎడదల తొలిసంజల వెలుగును సైతము మీరు
అంతరిక్షమందంతట,వెదజల్లుట.

మీ ఆత్మ, మిమ్ము ప్రార్థింపగ ప్రేరేపించిన క్షణమున,
దుఃఖము చెందక, ఏడ్వక మీరు వుండలేకుండిన
అది మిమ్ముల పదేపదే గిలిగింతలు పెట్టుగాక.
ఏడ్చిఏడ్చి, ఏడుపుమాని, సంతోషముబూని,
మీరు కిలకిలయని నవ్వుదాక.

ప్రార్థించెడి క్షణమందున, మీరందరు పైకెగసి,
ఆక్షణమున మీవలెనే ప్రార్థించెడి వారలను
అంతరిక్షమందుజేరి కలిసెదరు.
అందరినీ కలియుటకు మరోమార్గమేలేదు.

కేవలము మిమ్ముమీరు మరచుకొరకు
ఆనందము చేకూర్చెడి పరవశతను చెందుకొరకు

మధురాతిమధురమైన సంయోగము కొరకు
మీరు అగుపడని ఆలయమును దర్శింతురుకాక

యాచన మినహా మరియేవుద్దేశ్యము లేక
మీరు ఆ ఆలయమున కాలిడిన
అచట మీకు లభించునది పూజ్యము.
నమ్రులగుచు కేవలము మిమ్ము మీరు అణగద్రొక్కుకొనుకొరకే
ఆ ఆలయమున సాగిలపడినచో, మిమ్ములేవనెత్తరెవరు.
ఇతరుల శ్రేయస్సుకోరి, మీరాఆలయమందునచేరిన
మీ మొరను చెవిబెట్టు వారచటుండరు.

అగుపించని ఆలయమున, మీరు ప్రవేశిస్తేచాలు.
ప్రార్థన పలుకులు, ఎటులుండునో, ఎవో నేను మీకు నేర్పలేను.

మీ పెదవుల తానుజేరి, పలికెడి మాటలె దప్ప
మీరై పలికెడు మాటలు. పరాత్పరుడు వినడెప్పుడు.

సముద్రాలు, అరణ్యాలు, పర్వతాలు
ప్రార్థించెడి పద్ధతిని నేను మీకు తెలుపలేను.
చడిచప్పుడులేని రాత్రి శ్రద్ధగలిగి చెవి యొగ్గిన
వాని మౌనపు మాటలు ఇట్లు మీకు వినిపించును.
"పరాత్పరా ! మమ్ముద్ధరింపదలచిన జీవాత్మనీవే,
మాలో నుద్భవించు సంకల్పము, నిజముగ నీ సంకల్పమే.
మా రాత్రులను దినములుగా పరివర్తింప జేయునట్టి,
మాలోని ప్రేరణయును నిజముగ నీ ప్రేరణయే.
ఆ రాత్రులు సైతము నీవే ఆ పగళ్ళు నీవేను.
మాకు ఏదియును నిన్ను ఇమ్మను అవుసరములేదు,
మా అవసరాలు మాకు ఏర్పడక ముందే నీకు తెలియును.
మాకు కావలసినది, కేవలము నీవేను.
నీవు మమ్ము అనుగ్రహించుటయే, మాకన్నియు ప్రసాదించుట."

ఏ ఏటేటా ఒక్కసారి
పట్టణమున కేతెంచెడి సాధువొకడు
"సుఖమును గూర్చి మాకు చెప్పుడనిన"
అల్ ముస్తఫ యిటులనెను.

సుఖమొక స్వాతంత్ర్య గీతము
కాని అది స్వాతంత్ర్యము కానేకాదు.
సుఖము : మీ కోర్కెపూల వికసనము
కాని వాని కామిత ఫలమైతే కాదు
సుఖము : మీ మిట్టను కలిసెడి పల్లము
కాని అది లోతుకాదు ఎత్తుకాదు
సుఖము : పంజరాన పట్టుబడిన పక్షిరెక్కల రెపరెప
కాని అది చువ్వల నడుమవున్న అవకాశము కానేకాదు.
అవునవును, నిజముగానె సుఖమొక
స్వాతంత్ర్య గీతము.
నిండు మనసుతోడ మీరు
ఆ గీతము నెల్లప్పుడు
పాడినచో సంతోషము నాకైనను.
కాని, ఆ గానములోన మీరు
ఎడదల పోగొట్టు కొనుట
నాకు సమ్మతము కాదు
మీ లోని పడుచువారు
సుఖమునె సర్వస్వమ్మని
దానివెంటబడతారు
అపరాధులుగాను, ఎంచబడతారు.
వారి వీరి తిట్లకు గురి అవుతారు,
నేను వారి విషయములో తీరుపుఏదియు చెప్పను

వారిని దుర్భాషలాడి నొప్పింపను
అంతెకాదు మనసార వారలను సుఖమువెంట బడనిత్తును
ఏలన—
వారు సుఖమును గడియింతురు కాని
అది ఒంటరిది కాదెప్పుడు
దానికి తోబుట్టువులేడుగురు
వారిలో అందరికన్నను తక్కువ చక్కనిది
సుఖము కన్న ఎక్కువ చక్కనిది
కందమూలములకొరకు భూమిని పెకిలించు వానికి
పెన్నిధి దొరికిన విషయము మీరు వినలేదా ?
అయితే మీ పెద్దలు కొందరు
గతమున పొందిన సుఖముల
తప్పతాగి చేసినట్టి తప్పులువలె తలుస్తారు
బాధపడుచు విచారిస్తు వానిని స్మరిస్తారు
ఆ ఖేదము ఆ బాధ మనస్సుకు మబ్బు ముసుగు మాత్రమేను
అది దానికి శిక్షకాదు, శాస్తికాదు,
వేసంగిపంటను కోసుకొనుచున్నట్లు వారు
తమ సుఖములను స్మరింపవలెనెప్పుడు.
కాని వారి కొకవేళ
ఖేద పడుటలోనె హాయి గలదేని
వారి నావిధముగానే సౌఖ్యమొందనిండు
మీలోని మరి కొందరు
అటు సుఖము వెంటబడిపోయెడిపాటి పడుచువారు కాని
ఇటు కేవలము సుఖస్మరణ చేయు పాటి వయస్సు మళ్లినట్టి వారు కాని
కాని వారు :—
వారు ఆత్మను అలక్ష్యము చేయుటయో
ఆత్మకు ఉపచారము చేయుటయో
అగునను భావము తోడ
అన్వేషణ స్మరణమాని
సుఖముల నన్నింటిని పర్జిస్తు బ్రతుకుతారు.
ఆవదలుకొనుటలోన కూడ వారికబ్బు సుఖము. హాయి

ఈ రీతిగ వారు వణికే చేతులతో
కందమూలముల కొరకే భూమిని పెకిలించినను
వారికి సయితము దొరుకును పెన్నిధి తప్పనిసరిగ
కాని :—
ఆత్మకు అపచారము చేయగలిగినట్టి వాడెవ్వడు ?
చెప్పుడు ఉండిన.
నైటింగేలెప్పుడైన రాత్రి ప్రశాంతతను
భంగపరచు అపరాధము చేయగలదా ?
మిణుగురు పురుగెపుడైన చుక్కలకు
అపచారము చేయగలదా ?
మీ జ్వాలఅయిన ధూమమైన
గాలికి బరువను పించున ?
ఆత్మను
కర్రతో కెలికిన, కలుషితమగు నీటిమడుగని మీరు తలచెదరా ?
పలుమారులు మీరు సుఖమును నిరాకరించు నపుడే
మీ కోర్కెను
మీ అస్తిత్వపు పొరలల్లో భద్రపరచు కొంటారు
కాని ఎవరి కెరుక
నేడు విడవ బడినట్లు తోచునదే
రేపటికని పొంచివున్నదో ఏమో ?
మీ శరీరానికి సయితము
తన వారసత్వ వివరాలు, తన అవసరాల న్యాయము,
హక్కు భుక్తముల స్వత్వము
సంపూర్ణముగా తెలియును
అది వంచితము కాజాలదు.

మీ దేహము మీ ఆత్మవీణ
దాని నుండి తియ్యని సంగీతమయిన;
గందర గోళపు ధ్వనుల నయిన
పలికించుట మీ పని.

మీరు మీ ఆంతర్యము నడుగుడు
మేము, మా సుఖములోని మంచిదానిని
మంచిదికానిదానినుండి గుర్తించుట యెట్లని ?
మీరు మీ తోటలకు, మీ పొలాలకు వెళ్ళి చూడుడు :—
పూదేనెను సేకరించుట, తేనెటీగ—
సుఖమనుటయు—
దానికి తేనె నందించుట
పువ్వునకు సుఖమనుటయు—
మీకు అచట తెలియవచ్చు.
ఏలన—
పువ్వు తేనెటీగకు జీవనమును చిందించె చెలమ
పువ్వునకు తేనెటీగ సాక్షాత్ ప్రేమ దూతిక
సుఖమునివ్వడం పువ్వుకు
సుఖముపుచ్చుకోవడం తేటికి
అనివార్యఅవసరాలు
ఆనంద దాయకాలు
ఓ అర్ఫలీజు జనులారా !
మీరు సుఖముల యెడ
పువ్వులవలె తేనెటీగలవలె వర్తింపుడు.

"సౌందర్యంబన యేమిటో విందామని
మా కున్నది" అని ఒక కవి అన అతడనె—

ఎంతవరకు అందము మీ బాటగ తానై వెలయదో,
అడుగడుగున మీకు తానె మార్గదర్శిగా నుండదో
అంతవరకు మీరు దానినెక్కడ గాలించెదరు ?
ఏతరి సాధించెదరు ?

ఎంతవరకు అందము
మీ వాణియందు ప్రవేశించి
పదముల తొణికిస లాడదో;
అంతవరకు మీరు దాని
రూపురేఖనే పలుకుల వర్ణింతురు.
" సౌందర్యము—కరుణామయి, సుకుమార హృదయ
తొలిమాలు వైభవానికి
సగం సిగ్గుతో మురిసెడి తరుణమాతవలె ఆవిడ
మా మధ్యన తిరుగు లాడు" నని
బాధితులు, పీడితులు అనుచుందురు.
"అయ్యయో అట్లు కాదు
అందము బలమైనది, భయంకరమైనది
ప్రళయఝంఝామారుతమువలెనది
క్రింది నేలను, మీది నింగిని దద్దరిల్ల చేయుచుండును."
అని కామోద్రిక్తులు అందురు.
అలసి సొలసిన వారు, అతివృద్ధులు
ఇట్లందురు :—
'అందము; మెత్తని గుసగుసలది
అది మా ఆత్మలందె ముచ్చటిస్తు ఉంటుంది,
నీడ భయముతో వణికెడి మందప్రకాశము వలెనె
సౌందర్యము ధ్వనిసయితము మా మౌనమునకు వశమగు చుండును',

సంతప్తుల, శాంతిహీనులగువారల మాటల తీరే వేరు.
వారిట్లందురు:
'అందము కొండల నడుమ కేకలిడుట
వింటిమి చెవులార మేము
ఆ కేకలతో పాటే
డెక్కల తప తపలు, రెక్కల ఫట ఫటలు.
సింహాల గర్జనలు
మా కప్పుడు వినుపించెను.'
ఇక రాత్రులందు, నగరాన్ని
కనురెప్ప వాల్చకుండ
కాపాడెడి వారందురు కదః
'అందము ప్రతి నిత్యము తూర్పున ఉదయించు చుండు
ప్రొద్దు పొడుపు తోడ కలసి'
పట్ట పగలు, పనిపాటల మునిగితేలువారును,
ప్రయాణీకులును అంటారు

'మలిసంజల కిటికి నుండి అందము
భూమిని తొంగి చూస్తుండగ మాకు కనుపించినద'ని.
చలికాలము ఈదరలో కొంకర్లు పోవువారు, అందురు కదః
'అందమెపుడు వసంతునితోడకూడి గుట్టలపై గంతులేస్తు వస్తుంద'ని.
మండే గ్రీష్మమ్ములోన పంటలు
కోసుకొనే వారలంటారు:
'హేమంతములో అందము పండుటాకులను
కలిసి నృత్యము చేయుచు నుండగ
మంచు మల్లెలు ఆమె కొప్పులోచేరి నవ్వుల నొలక బోయగ
మేము స్వయముగ చూచి నామ'ని.
సౌందర్యంబన నేమిటో ఇంతమంది ఇన్నితీర్ల చెప్పినారు
వాస్తవమాలోచించిన
వారు చెప్పినట్టిదేదియు సౌందర్యము గూర్చికాదు
వారింతగ చెప్పినది
తమ తీరని అవసరాల గూర్చియేను.

కాని అందము తీరనిఅక్కర కాదు
అది ఆనందపరవశత, అది ప్రేమోద్రిక్తత.
సౌందర్యము దప్పిగొన్న గొంతుకాదు.
బిచ్చముకొరకై చాచిన హస్తము సయితము కాదు
అది ప్రదీప్తమయిన హృదయము
మంత్ర ముగ్ధమైన ఆత్మ.
సౌందర్యము కనులకు అగుపడు మూర్తి కాదు
వీనులకు వినబడు గీతము సయితము కాదు
కనులు మూసికొని యున్నను
మీ కగుపడు రూపము అది.
చెవులు మూసికొని యున్నను
మీకు వినబడు గీతము అది.
చిట్లిన బెరడులోని రసము కాదు సౌందర్యము
వాడి గోటికి తోడ్పడు రెక్క కూడ కాదు అది
సౌందర్యము నిత్య వసంతోద్యానము
సౌందర్యము :—
సతతము ఆకాశమందు
విహరించెడి దివ్య గంధర్వ సమూహము.
అర్ఫలీజు వాసులారా !
సౌందర్యము జీవితము
తన పవిత్ర ముఖమునుండి అవగుంఠనమును
తొలగించిన జీవనమే సౌందర్యము
కాని, మీరే ఆ జీవనము
ఆ అవగుంఠనము కూడ మీరే.
సౌందర్యము :—
అద్దములో తన ముఖాన్ని చూచుకొను చిరంతనత్వము
కాని—
ఆ చిరంతనత్వము మీరే
ఆ అద్దము సయితము మీరే.

మతోపదేశకుడు. వయోవృద్ధుడు
"ధర్మము విషయము చెప్పు" మన విని
అతడనె—

"నేను యీరోజంతయు మాటాడినది మరియేమిటి?"
'ధర్మ' మనిన అన్నిపనులు అన్నిఆలోచనలు కాక మరియేమిటి?
అంతెకాదు
ఏదో ఒక కర్మ కానట్టిది—సంకల్పముకూడ కానట్టిది
మరియేదో అద్భుతమగు చమత్కార మాశ్చర్యము
అనవరతము హృదయంలో చిందులాడుచుండునదియును ధర్మమేకద?
అయ్యది
బండమీాద సుత్తె మోదునపుడుగాని,
చేతులుమగ్గముపై ఆడునపుడు గాని,
ఆవిర్భవించిననేమి?
తాము చేయు పనులనుండి తమనిష్ఠను
తమవృత్తినుండి తమశ్రద్ధను
విడదీయుట యెవరికి సాధ్యము?
జీవితకాలమును విభాగించి
ఈభాగము దేవునిది, ఇదినాది
ఇది నాఆత్మకొరకు, యిది నాశరీరము కొరకు
అని చెప్పుట యెవరికి సాధ్యపడును?
మీా జీవిత క్షణములన్నియు
ఆత్మనుండి ఆత్మవైపు సంచారముచేయు రెక్కలే.

శీలమును కేవలము పీతాంబరమువలె ధరించువాడు
అసలు బరిబాతగ వుండుటమంచిది
గాలికాని యెండకాని వాని వొంటికి చిల్లులుచేయవు.
ఎవడు తనవర్తనను నీతి నియమాలుగ నిర్వచించునో
వాడు తన గానవిహంగాన్ని పంజరాన బంధించును.

స్వేచ్ఛాగానము పంజరాల చువ్వలలోపలనుండి పెకలదు
'పూజ' మనయిష్టానుసారము తెరుచుటకు మూయుటకు
వీలున్న కిటికీయని భావించినవాడు,
క్షితిజాలే గవాక్షాలుగాగల తన ఆత్మమందిరములో
ఈక్షణమువరకు ప్రవేశించలేదు.

మీనిత్యజీవితమే మీమందిరము, అదే మీధర్మము.
మీరు ఆమందిరమున ప్రవేశించినపుడెల్లను
మీసర్వస్వమును మీవెంటనే వుంచుకొనుడు.
మీ నాగలి, మీడాకలి, మీకొలిమి, మీసమ్మెట, మీవీణియ
ఉపయుక్తంబని, వినోదము సమకూర్చునదని
మీరేమేమి నిర్మాణము జేసినారో అంతయు మీవెంటపెట్టుకొనుడు.
ఏలన—
ధ్యానమందు సైతము మీరు గడించిన స్థాయికన్న, సిద్ధికన్న పైకెగురలేరు.
మీ అపజయాలకన్న క్రిందికి జారలేరు
ఎల్లప్పుడు మీవెంట సకల మానవకోటిని జంటగానె వుండనిండు.
ఏలన—
మీరు మీ ఆరాధనలందు వారి ఆశల శిఖరాలకన్న ఎత్తునకెగరలేరు,
వారి నిరాశల అడుగుకన్న క్రిందికి దిగలేరు.
మీరు దేవుని తెలిసికొన దలచిన
రహస్యాల చిక్కుల విడదీసెడివారు కాబోకుడు
అంతకన్న మీరు మీ చుట్టుపట్ల గమనింవుడు,
మీ పాపలతో ఆడుచుండు పరమాత్ముని దర్శింతురు.
అంతరిక్షమందరయుడు;
మేఘములో నడయాడుచు విద్యుల్లతతో తనచేతులు సారించుచు,
వర్షములో అవతరిస్తు అతడు మీకు అగుపించును.
పూల్లలో నవ్వుతూ, చెట్లల్లోచేతులెత్తి ఆడిస్తూ
పువ్వుల చిరునవ్వెడు, చెట్లల్లో చేతులెత్తి ఆడించెడివాడు
మీకు కనిపించును.

అప్పుడు అల్‌మిత్ర,
"మృత్యువు విషయము యెరుగుట మాకిప్పుడు సమ్మత" మన విని
ఇటుల పలికె అల్‌ముస్తఫ—

మీరు మృత్యురహస్యము నెరుగ కోరెదరు
కాని, బ్రతుకు యెడదలోన దాని గాలించక మీకది తెలియుటెట్లు?
రాత్రులందె చూడగలుగు పగటిగుడ్డి గుడ్లగూబ
ప్రకాశాల రహస్యాల ముసుగుల తొలగింపలేదు.
మీరు మృత్యుస్వరూపాన్ని తప్పక దర్శింపదలచిన
ముందు బ్రతుకు శరీరము దాక మీ యెడదను
విప్పుడు విశాలముగ.
ఏలన—
నది జలధి రెండు ఒకటైనట్లే చావు బ్రతుకు కూడ ఒక్కటే
మీ ఆశల ఆపేక్షల అట్టడుగున వున్నది
మీ పారలౌకిక మౌన జ్ఞానమే.

మంచుక్రింద కలలుగనే విత్తనాలవలెనె
మీ హృదయము వసంతాల కలలుగనును
ఆ కలలయందు నిండువిశ్వాసముతో నుండుడు
దానియందు దాగివున్నది అమరత్వమునకు ద్వారము.

మృత్యువు విషయమున మీభయము
ఆ గొల్లని భయమువంటిదేను.
రాజతనికి స్వహస్తాల సన్మానముచేయు చుండెనని తెలిసియు
వాడు వణికిపోవుచుండు భయముతోడ
ఒకపరి భయముతోడ వణకుతోనె తాను రాజలాంఛనాలతోడ
శోభిల్లుచునుంటిననుచు పట్టరానిసంతోషముతో లోలోపల ఉబ్బితబ్బిబ్బు పడడా?
అట్లయ్యును తాను భయముతోడ కంపించుచుటే

వానికి మది నుండుట గుర్తుండుట.

ఏలన—

చచ్చుటయన గాలిలోన నగ్నముగా నిలుచుండుట
కరిగి సూర్యుని జేరుట కాక మరియేమిటి?

ఊపిరి ఆగుటయన—
ఉన్నతమై విస్తరించి నిరాటంకముగ
విరాట్ తత్వమునరయగ
ఎడతెగని ఎగుడుదిగుడు నడకనుండి
శ్వాసకు స్వాతంత్ర్యము ఒసగుటకాక మరేమిటి ?
మౌననదీజీవనముల గ్రోలినపుడె
మీరు వాస్తవముగ పాడెదరు
కొండతలను చేరినపుడె మీరు ఆరోహించుట ఆరంభింతురు.

పుడమి మీ సర్వాంగములను తన ఒడినిడుకొన్నప్పుడే
మీరు వాస్తవముగ నాట్యముచేతురు.

ఇంతలోనట మలిసంజల
వేళ సమీపం బాయెను.
అప్పుడు అల్‌మిత్ర ద్రష్ట
వీడుకోలుగ పలికెను.

" నేటి మా ఈ పగలు ధన్యము
నేడు మా ఈ స్థలము ధన్యము
మాతో ఇంతగ ముచ్చటించిన
మేటి! నీదగు ఆత్మ ధన్యము ! "

అనవిని అల్‌ముస్తఫ
"నేనా ? పలికినదింతకు, నేనేనా ?
కానా! నేనును వినువాడను ఒకడకాన! "

అంతనతడు దేవాలయ
పరిసరాలు విడిచి నడచె
సాగరతీరానవున్న ఓడకడకు
అందరికందరు నడిచిరి అతనివెంట
అల్‌ముస్తఫ ఓడనెక్కి పైభాగమునందునిలిచి
తీరంబున గుమిగూడిన జనుల ముఖాముఖిగచూచి
గొంతెత్తి పలుకెనిటుల:
" మేము దేశదిమ్మరులము
ఎల్లప్పుడు మరింత ఒంటరి
మార్గమునకై వెదుకుచు నుందుము

ఓరోజు గడిపినచోట మేము
మరో రోజును మొదలుపెట్టము
క్రుంకుపొద్దు మమ్మువీడి
చనినచోట ప్రొద్దుపొడుపు మముచూడదు
పుడమి, నిద్రయందున్నను,
మేము ప్రయాణము చేతుము.
మర్రివంటి వృక్షాలకు
విత్తనాలగింజలము,
నిండు పండుతనము మాకు
చేకూరిన స్థితియందున,
మాహృదయము నిండుతనము
పొందియున్న క్షణమందున,
గాలి చేతిలో పెట్టబడుదుము.
ఇటనట వెదజల్ల బడుదుము.

మీ మధ్యన నే గడిపినరోజులు
చాలాతక్కువ, మీతో నే పలికినట్టి
మాటలు అంతకు తక్కువ
అయిననేమి;
నామాట మీచెవులయందు సన్నగిలిన,
నాప్రేమ మీస్మృతినుండి మాయమైన
తక్షణమున నేను తిరిగి వచ్చెదను.
అపుడునేను
ఇంతకన్న సంపన్నంబగు హృదితో
ఇంతకన్న ఆత్మవశంబై పోయిన
పెదవులతో నే పలికెద.



" అవునవును నేను తిరిగివచ్చెదను
కడలిపోటు తోడకూడి. "

అవునవును నేను తిరిగివచ్చెదను
కడలిపోటుతోడకూడి
చావు నన్నుదాచినను,
మితిమీరిన మౌనము
నన్నావరించుకొని వున్నను,
మరోసారి మీబుద్ధిని
అరయుదును నేతప్పక,
వెదుకాడుదు నేతప్పక,
నా వెదుకులాట వ్యర్ధమెపుడు కానేరదు.

సత్యము గానట్టిదేదియు నే
పలుకకున్న ఇంతకన్న స్పష్టమైన గొంతునుండి
మీ ఆలోచనల కింతకన్న
సన్నిహితమగు మాటల్లో
ఆ సత్యము వెల్లడియగు తనకుతానె
అర్ఫలీజు వాసులార !
నేనిప్పుడు గాలివెంట
పోవుచుంటి నంతెగాని,
పాతాళపు శూన్యమ్ముల
జేరనంటకాదు నా పయనము.

మీ అవసరాలు తీర్చినది,
నా ప్రేమకు సంపూర్ణత గూర్చినది
కాకున్నా ఈరోజును మరోరోజుదాక
అభయవచనముగానే నిలిచిఉండనీడు.
మనిషి అవసరాలు మారు
కాని మారదతని ప్రేమ
ప్రేమయె తన అవసరాల
తీర్చి తృప్తి పరచాలను,
అతనివాంఛయును మారదు.
అందుకొరకె నిశ్చయముగ
ఘనతరమౌనంబునుండి
నేను తిరిగివస్తానని తెల్సికొనుడు,

తొలిసంజల పుడమిమీద
మంచును మాత్రమువదలి
చెల్లాచెదరగు పైరయె. తిరిగి ఎగిసి
జతగూడి వానమబ్బుగామారును.
ఆ తదుపరి వానై నేలవ్రాలును
పైరమాదిరికానిదికాదు నాదుఉనికికూడ
రాత్రులందు నడిచప్పుడు లేనప్పుడు
మీ వీధుల నేనడిచితి
మీ గృహముల ప్రవేశించె నా ఆత్మ
మీగుండెల దడదడ నాగుండెయందు జరుగుచుండె,
మీ ఊపిరి ఆడుచుండె నామొగాన
మిమ్మందర నే నెరిగితి, మీ అందరి
పరిచయమ్ము గలిగెనాకు, అవునవును
నే నెరిగితి మీ సుఖమును, మీ భాధను,
అంతెకాదు
మీ నిద్రలోని మీకలలు నాకలలే అయివుండెను.

కొండలతో చుట్టియున్న
చెరువువోలె మీ మధ్యన
నేనుంటిని పలుమారులు.
ఎదిగిన మీ శిఖరాలకు,
ఎగుడు దిగుడు వంపులకు,
నే నెప్పుడు అద్దము బట్టితి
అంతెకాదు
మీ ఎదుగుల మీ వంపుల
ఎక్కిదిగుచు కదలిపోవు
మీ ఊహల మీకోర్కెల
మందలు నాయందున
బింబించెను.
అంతేనా— కాదుకాదు
మౌనంబగు నా ఆంతర్యము జేరెను,
మీ పిల్లల కిలకిలలు; సెలయేరుల రూపుదాల్చి

మీలోని పడుచువారి తహతహయును చేరెవచట
వదులలోలె గంతులిడుచు.
నన్నుజేరి, నాలోపలదూరిపారి,
నా అడుగునందు పడియున్నను
తమపాటలు, తమఆటలు, ఆపలేదు అవియింకను,
కాని ఆ కిలకిలలకన్న తియ్యనిది.
ఆ తహతహ కన్నను గొప్పది.
నన్ను వచ్చిచేరినది మరియొక్కటి.
అది మీలో యున్నట్టి అనంతత్వ, అసీమత్వ, నిత్యవిరాటత్వమేను
మీరందరు ఆ విరాట్ పురుషుని కాయములోని స్నాయువులు మాత్రమేను
అతని రాగాలాపన యందలి ధ్వనిరహితంబగు స్పందన
మాత్రమేను— మీసంగీతము సొంతము
ఆ విరాట్ పురుషుని యందుండుటచేతనే మీరుకూడ అనంతులు.
ఆ విశ్వరూపు సందర్శనమందె
నేను మిమ్మందర దర్శించితి—మిమ్మందర ప్రేమించితి.
ఆ విరాట్ క్షేత్రమందు లేనట్టివి,
ప్రేమకు అందుబాటులో నున్నట్టివి,
ఎడాలు, దూరాలు యేమైనగలవా ?
ఆ విరాటత్వలంఘనకు లొంగనట్టి
ఆ అనంతత్వమందుజేరి యిముడనట్టి
దివ్యదర్శనంబు, ఊహాకల్పన యేదైనకలదా ?
మధుమంజరి వసంతాల తులతూగెడి మహామహీధరమువోలె
కొండంతటి చెట్టువోలె
ఆ విరాట్ పురుషుని వునికి గలదు మీలోపల
వాటమైన అతనిశక్తి మిమ్ములను పుడమితోడ
కట్టియుంచు దిట్టమైన బంధనాలతో నెప్పుడు.
ఆ మహావృక్షంబున పూసినట్టి పూలయొక్క ఘుమఘుమలే
మిమ్ముకూడ లేవనెత్తు తమతోడనే ఆకసమున,
ఆ విరాటత్వశక్తి చిరజీవనమందె మీకుకూడ చేకూరును అమరత్వము.
మీకుతెలియజెప్పబడెను
బ్రదుకు గొలుసు లంకెలలో, అన్నింటికన్నను
బలహీనంబైనయట్టి లంకెవోలె మీరుకూడ బలహీనులెయని.

ఇది కేవలము సగము నిజము.
ఆ గొలుసులోని అన్నిటికన్నను ధృఢమైన లంకెవోలె
మీరు బలవంతులు కూడ.
సామాన్యంబైనయట్టి యేదో మీచర్యచూచి,
మీశక్తిని, మీబలమును లెక్కించుట,
నురుగుయొక్క బలహీనత నాధారముగా గైకొని
కడలిశక్తి లెక్కించుట, దానిబలమును అంచనవేయుట, తూచుట
మీరుపొందినట్టి అపజయాలబట్టి మిమ్ముపరికించుట
ఋతువులను స్థిరమగు స్థితిలేనట్టివి అని ఆక్షేపించుట.
అవును, మీరు నిజముగానే సాగరమువంటివారు
బరువుల యెదపైనిడుకొని
గొప్ప గొప్ప ఓడలన్ని కదులుటకు యెదురు చూచుచున్ననేమి ?
సాగరమువలనే ఆటుపోటులను మీరు వేగిరపరచలేరు.
అదేతీరుగ మీరు ఋతువులవంటివారుకూడ
మీ ఆకురాలు కాలమందు—
వసంతాగమనము, మీరు కాదు, రాదు అనుచున్నను
మీ ఆంతర్యములో హాయిగ విశ్రాంతిని పొందుచున్న వసంతాలు
నిద్రమబ్బులోనె ముసిముసినవ్వుల నవ్వుకొనును,
అంతెకాని, మీవర్తనపై యేమాత్రము కించపడవు నొచ్చుకోవు.
మీరు ఒకరితోనొకరు
"అతడు మనలను పొగిడెను
అతడు మనలోని మంచిని మాత్రమే చూచెను" అని అనుకొనవలెనని
నేను మీతో యీమాటలు చెప్పుచుంటినని మీరు తలచరాదు.
మీ అంతరాత్మయెరిగనట్టి సంగతులే నేను మీకు చెప్పుచుంటి,
శబ్దమయంబగు జ్ఞానము,
శబ్దరహితంబగు జ్ఞానపు ఛాయగాక మరియేమిటి ?
మీ ఊహలు, నామాటలు, మూతమెత్తి, ముద్దరేసి
దాచబడిన స్మృతిభాండములోని తరంగాలు మాత్రమేను.
మన గతకాలపు కవిలెలన్ని,
భద్రముగా దాచబడియున్నవి ఆ గాబులోన
పుడమికి మనపరిచయము, స్వయముగ తనపరిచయములేని
పూర్వాతిపూర్వదినముల సంగతులన్నియుకలవు ఆ గాబులోన,

అంతెకాదు—పుడమియింక రూపుకూడ దాల్చనట్టి,
పుడమి తల్లికణకణము, ఆందోళనతో
పుణుకులాడుచు తిరుగులాడి, ఒకచో చేరిన
మొదటిరాత్రి వివరాలు కూడకలవు ఆ గాబులోన.
ఇదివరలో మీకడకు జ్ఞానులు యెందరోవచ్చిరి.
మీ అందరికి తమజ్ఞానము పంచిపెట్ట—
మీ జ్ఞానము పంచుకొనగ వచ్చితి మీకడకునేను.
చూడుడు, గమనింపుడు,
కడుచోద్యము, కడుచిత్రంబిది,
నే పొందితి మీనుండియే
జ్ఞానముకన్నను మహత్తరమైనది మీనుండియే పొందితి.
అదియేమన—సతతము అధికాధికముగ ప్రజ్వలించు మీయందలి చైతన్యజ్యోతి
కానీ, మీరు వర్ధిల్లెడు ఆజ్యోతిని గమనించక
కేవలము మీ ఆయువు దినములు తరుగుచుండెనని యేడ్తురు.
గోరీలకు భయపడెడి కాయంబులోన
జీవనమును దర్శింపగ తిరుగాడెడి జీవనమే ఆ చైతన్యము.
నిజముచూడ, యిచట అసలు గోరీలన్నవి,
స్మశానములన్నవి, లేనేలేవు,
ఈ కొండలు, యీ లోయలు, యీ బయళ్లు
జీవన యాత్రాస్థలములు, ఊయెలలు, మెట్లు.
మీ పూర్వుల పూడ్చినట్టి సమాధుల, కాల్చినట్టి స్మశానాల,
పరిసరాలలోన, మీరు తిరుగునపుడు
పరిశీలనతోచూచిన. మీరు కన్నులార గాంచగలరు
ఆ స్థలమున మీరు, మీపిల్లలు ఆనందముతోనాడుట
సంతోషముతో గంతులిడుట
అవును మీరు తెలియకనె యెన్నోసార్లు ఉత్సాహముతోనుందురు
హర్షమును బొందెదరు.
మీకడకు మరికొందరు వచ్చినారు.
మీకు బాసటగ నిల్చినారు.
అపూర్వమైన, అమోఘమైన హామీలను యిచ్చినారు—
ఇహముగూర్చి. పరముగూర్చి,
ప్రతిఫలముగ మీరిస్తిరి వారలకు

మీ బలమును, మీ ధనమును, మీ కీర్తిని,
నేను మీకు యివ్వలేదు యేహోమియు
ఏ విషయమునందుకూడ నేను మీకు బాసటగనిల్వలేదు,
అయిన నేమి—
వారికన్న అధికముగా, మీ ఔదార్యానికి పాత్రుడనయినాను నేను
అది ఎటులన—
బ్రతుకుగూర్చిన ఆరని దప్పి—తీరని తహతహ—
నాకు మీరు ప్రసాదించినారు,
మనిషికిగల అభిలాషలన్నిటిని దప్పికొన్న పెదవులుగా
వాని జీవితాన్ని జీవనమును యెగజిమ్మెడి నిర్ఝరిగా
రూపాంతర మొనరించుటకన్న
ఘనమగు సన్మానము, దానము,
మరొకటిలేదు నిశ్చయముగ.
కలదుకలదు దీనిలోనె నేపొందిన ఘనమగు సన్మానము
నాకు మీరుయిచ్చినట్టి అమూల్యమైన కానుకకలదు—కలదు దీనిలోనె.
దప్పితీర్చుకొనుటకంచు నేనానిర్ఝరి దరికేగినపుడెల్లను
చైతన్యముతో చిందులుత్రొక్కుచున్న జీవనము సహితము
నావలెనే దప్పితోడ తహతహపడుచుండుట నేగాంచితి.
నే దానిని త్రాగుచుండ అదికూడ నన్నుత్రాగు.
కానుకలను స్వీకరించుటయందు
నేను యెంతో బిడియపడెడి వానివలె, గర్విష్టివలె
మీలోని కొందరికి భాసించుటకూడ నిజమే,
నే నెంతోగర్విష్టినే, బిడియపడు వాడనే
కాని నా గర్వము. నా బిడియము
ప్రతిఫలముగ కూలి యిచ్చుదాన్ని స్వీకరించునవుడె
కానుకలను స్వీకరించుట యందుకాదు.
మీరునన్ను మీపంక్తిని చేర్చుకొని విందులారగించుటకు సంసిద్ధులు
అయివుండగ
నేను అడవులందు తిరిగి రేగుపండ్లు యేరుకొనితినుచుండుటకూడ నిజమే
మీరునన్ను మీయిండ్లలో హాయికూర్చు పాన్పులపై నిద్రపుచ్చు యేర్పాట్లు
చేసియుండ
గుడిబండలపైన నేను నిద్రించుటకూడ నిజమే.

కాని నానోటిలోన రేగుపండ్ల తియ్యదనము పెంచినది
నా రోజులు యెట్లుగడుచుచున్నవోయని మీరు పడిన ఆదుర్ద
నాయెడగల మీ యెడదల ఆదరభావమే కాదా ?
బండలపై నే హాయిగ నిద్రించుట, కమ్మని కలలగాంచుట
నారాత్రులు యెట్లు గడుచుచున్నవోయని
మీరెప్పుడు మనసార తలచుచుండుటయెకాదా?
మీరు నాయెడజూపిన యాదయకు, ఆదరణకు
నేను మిమ్ము యెల్లప్పుడు దీవించెద మనసారగ
ఎంతో యిచ్చియును మీరు యిచ్చుచుంటిమని యెరుగరు
ఒక తీరుగ అదికూడ మంచిదేను
సద్గుణము, సత్కార్యము
అహంకార దర్పణమున తన్నుతాను జూచుకొన్న మరుక్షణమున
బండబారిపోవుచుండు.
గొప్పగొప్పపేర్లతోడ సత్కార్యము తన్నుతాను పిలుచుకొన్న మరుక్షణాన
అరిష్టాల కనిపెంచెడి దయ్యముగా మారుచుండు
మీలో కొందరు నన్ను, మనుజుల సహవాసమును
యేవగించుకొను యేకాకిగ భావించిరి
నేనెప్పుడు యేకాంతపు మత్తులోనె తిరుగాడుచు
మరియేదియు చూడను అని, వారిమతము.
మీరుకూడ అనుకొంటిరి
"అతడెప్పుడు అడవిలోని చెట్లతోనే
ముచ్చటించుగాని యెప్పుడు మనుజులమాటే తలచడు" అని
"ఏకాకిగ కొండకొనల కూరుచుండి
మనపట్టణాన్ని చిన్నచూపుతో చూచును" అని
నిజమే—
అడవులయందే నేను తిరుగాడుట, కొండల తలపై నెక్కుట,
అచట నేరోజుల తరబడి వుండుటకూడ నిజమే
దూరంబుగపోయి నిలబడక, ఎత్తగుచోటికి యెక్కక
నేనుమిమ్ము సంపూర్తిగ, నెమ్మదిగా చూచుటెట్లు ?
విడిపోనిదే, దూరముకానిదే
ఒకదొకనికి సన్నిహితుడు అగుటయెట్లు ?
మీలోని మరికొందరు నేరుగ నాతోనన్నది.

మాటలలో కాకున్నను మనసులోన అనుకొన్నదియిది
" అపరిచితుడా ! ఎరుగనట్టి ఓ పాంథుడా !
అందని ఔన్నత్యాలను ప్రేమించెడివాడ !
ఎందులకయ్యా ? నీ నివాసమెందులకయ్యా ?
రాబందులు గుడ్లుపెట్టు కొండలతలపైనచేరి
నీ వుండుట యెందుకయ్యా ?
అందనిదానిని అందుకొనెడి ఆయాసము
చేరలేనిచోటుల వెదుకులాడు ప్రయాసము ఎందుకయ్యా ?
నీవు విసరుచున్న వలల్లో
ఏ పెనుగాడ్పుల పట్టదలచినావు ?
ఏ ఆవిరి పిట్టలను నీవచ్చట వేటాడుట ?
రమ్మురమ్మ, మాకడకురమ్మ, మాలోనొకడవు కమ్మ
మాపంక్తిని కూరుచొనుము, మావిందుల భుజియింపుము
మే మొసగెడి మధురసముగ్రోలి నీ దప్పిని తీర్చుకొనుము."
కానివారి యేకాంతపు సంభాషణ
మరికొంత ఆంతర్యపు లోతుల కనినది అయివుండిన
నాతిరుగులాట, నావెదుకులాట, నా వేట అంతయును
మీ అందరి హర్షంబుల, దుఃఖంబుల
రహస్యాల కనుగొనుటకు మాత్రమేయని వారికి తెలిసెడిది.
అంతరిక్షమందు నేను వెన్నాడుచు తిరిగినది
అచట సంచరించుచున్న మీవ్యాపక వ్యక్తిత్వాలనే
కాని వేటకాడుకూడ తాను వేటకుగురియైనవాడే.
నా యెడదను వెతుకులాడి తాకుటకే
నావింటినుండి బాణంబులు పయనించెను.
ఎగురాడినవాడుకూడ స్వయముగా పారాడిన వాడేను
ఆకాశపుటంచులంటి రెక్కలార్చి నే విహరింపగ,
పుడమిమీద నానీడయే తాబేలుగ కదలాడెను
దృఢవిశ్వాసముగల నేనే సంశయాత్ముడనుకూడ
మీయందలి నావిశ్వాసమును, శ్రద్ధను దృఢతరము చేసుకొనగ
మీయందరి పరిచయము మరియొకింత పెంచుకొనగ
ఎన్నోమారులు నేను నాగాయములో వేలుపెట్టి కెలుకుకొంటి
నేగడియించిన యిట్టి విశ్వాసముతో, యెరుకతో నేను మీకుచెప్పుచుంటి,

మీరు మీశరీరాల చెరసాలలలో కట్టబడి లేరనుచు.
మీ ఆంతర్యపుశక్తి పరిధి మీ యిండ్లవరకే. మీ పొలములవరకే
సీమితమైలేదనుచు.
మీ లోని వ్యక్తిత్వము, యేదో యెండపొడకు బైటకు పారాడివచ్చి
భయముతోడ నిలువెల్ల వణికిపోయి
రక్షణకై యేచిల్లినో దూరిపోవు క్షుద్రకీటకము కాదనుచు
మీవ్యక్తిత్వము శక్తిసంపన్నంబైనట్టిది, సర్వస్వతంత్రంబైనట్టిది,
పుడమిని తనయొడినిడుకొని అంతరిక్షమంతటను విహరింపగల యట్టిది.
అనిమీకు నేను నమ్మకముగ చెప్పుచుంటి,
నామాటలు అయోమయముగానుండిన, వానిని వివరించిచూడబూనకుడు.
సకలసృష్టి ఆరంభము, సకలవస్తుప్రారంభము అయోమయమే,
రూపురేఖదాల్చునట్టి సంజ మసకతనమే.
ఈ స్థితి
వస్తుచయపు అంత్యమందు యిటులుండదు.
మీరునన్ను ఆరంభముగా దలచుటే
నాకు యెప్పుడు సమ్మతము, సంతోషము
జీవనము, జీవించెడి సృష్టికల్పన గర్భధారణ
మంచు బిందువునందె జరుగును.
స్పటికమందు జరుగదెపుడు.
ఎవరికెరుక స్పటకము:—
సంపూర్ణముగ నశియించెడి దశలోనున్నయట్టి మంచుబిందువు అని ?
నన్ను తలచుకొన్నప్పుడు యీమాటలు తప్పకుండ జ్ఞాపకముంచుకొనుడు.
మీలోనిది, మీ అంశంబైనట్టిది
మీ యితర అంశంబులకన్న మిక్కిలి బలహీనమైనట్టిది,
అయోమయంబైనట్టిది, బిత్తరపోయిన యట్టిది
ఏదికలదో అదియే
అన్నిటికన్నను బలవత్తరమైనట్టిది, మాహత్తరమైనట్టిది, అని.
మీఎముకల నిర్మాణము, యెదుగుపొదుగు. గట్టితనము
చేకూర్చునది మీఊపిరి అవునా కాదా ?
మీ పట్టణమును కట్టినది
పట్టణపు ఘనత, శోభపెంచుటకై
ప్రతివస్తువును అచట సమకూర్చినది

మీరు కనినట్టికలయే అవునా కాదా ?
అట్టికలను గాంచినట్టి సంగతైన మీకు జ్ఞాపకము లేకున్నను,
ఆ ఊపిరిలోని "యెగుడు దిగుడు" "ఆటుపోటు"
మీరొకపరి దర్శించిన మరియేదియు మీకు చూడ మనసొప్పదు.
ఆ కల గుసగుస ఒకపరి మీ చెవి సోకిన,
మరి యేమాటయు, యేధ్వనియు మీరు విననొల్లరు
కానీ మీరు చూడరు, వినరు
అదికూడ ఒకతీరుగ మంచిదేను
మీ కన్నుల మసకజేయు, తెరలపొరలు యే చేతులు అల్లినవో
ఆచేతులే వానిని తొలగించగలవు.
మీ చెవి బెజ్జాలనిండ యేచేతులు బంకమట్టి మెత్తినవో
ఆ చేతులే ఆ మట్టిని తీసి పారవేయగలవు.
అపుడు మీరుచూడగలరు, అపుడు మీరు వినగలరు
అయినా ఓనాడు అంధకారమే చూచెడి గుడ్డితనము
మూగతనమే వినుచుండిన కొండ చెవుడు వుండెనని
మీరు దిగులు చెందరాదు, పశ్చాత్తాప పడరాదు
ఏలన—
ఆ గుడ్డితనము, చెవుడు మీకోనాడుండుటచేతనే
మీరలు యీనాడు వెలుగు ప్రేమించినట్లే, ఆదరముగ చూచినట్లె
చీకటిని ప్రేమించగలరు, మౌనంబును వినగలరు.
ఇట్లుపలికి అతడొకపరి చుట్టుపట్ల పరికించెను
అతనికపుడు, చుక్కానిని చేతబూని,
ఒకపరి గాలితోడనిండి వుబ్బితబ్బిబగుచుండిన తెరచాపలను—
మరోసారి—
పోవలసిన సముద్రాల దూరాలను చూచుచున్న
ఓడ యొక్క కప్తాను కనుపించెను,
అదిగని, అతడుతిరిగి యిటుల పలుకసాగె
"ఓపికతో, మితిమీరిన ఓపికతో వ్యవహరించుచున్నాడు
నా ఓడయొక్క కర్ణధారి,
గాలివిసరు, జోరుహోరు, అనుకూలముగా నున్నది,
తెరచాపల తహతహకు హద్దులేదు.
చుక్కానియు, తనను కదుపమని దీనముగా యాచిస్తున్నది

ఇంతైవను నా నావిక నాయకుడు, కర్ణధారి,
నా మాటల అంత్యముకై, నా మౌనమునకై వేచియున్న వాడంతే
నెమ్మదిగా మాటాడక
కర్ణధారియేకాదు, యితర సరంగులు సహితము —
ఎన్నోసార్లు తమసాగర యాత్రలందు
ఉవ్వెత్తునలేచిపడెడి తరంగాల జయగానము విని యుండియు
ఓపికతో నామాటలు యింతవరకు వినుచుండిరి."
ఇకవారు యేమాత్రము ఆగనవసరములేదు.
సిద్ధముగా నుంటి నేను
పారిపారి నది చేరినది సాగరమున.
మరోసారి జగన్మాత తన శిశువును హృదయానికి హత్తుకొన్నది
స్తన్యము నోటికి అందించినది.
మీకు శుభంబగుగాక! ఓ అర్ఫలీజు వాసులారా! ఇదే పోవుచుంటినేను
ఈరోజు యింతటితో ముగిసినది
తనతలుపులన్ని మూసివేసుకొనుచున్నది
రాబోయెడి దినము తనను చేరకూడదను తలపుతో
రెక్కల తలుపులన్నిటిని మూసుకొనెడి కమలమువలె,
ఈ రోజు యింతటితో ముగిసినది.
ఈ రోజున యీచోటున మనకు యివ్వబడినదెల్ల
జాగ్రత్తగ భద్రపరచుకుందాము.
ఒకపరి, అవిచాలకున్న, తిరిగి రాకతప్పదు మరి.
తిరిగివచ్చి, అంతకలసి, విశ్వదాత సమక్షాన
చేతులు చాచుటకూడ తప్పనిసరి,
మరవకండి, నేను తిరిగివచ్చెదననుమాటను మీరు యెపుడు మరవకండి.
ఈ విడిపోవుట కొంతవరకె
అంతలోనె తిరిగిమిమ్ము కలవదలచు నాకోరిక
మరో శరీరము కొరకని నురుగు దుబ్బ జమచేసికొనును
కొంతసేపే—గాలి ఊయల నూగుచు సేదదీర్చుకొనుట నేను—కొంతసేపే
అంతలోనే మరోమాత నన్ను తన గర్భాన దాల్చు
వందనాలు !
మీ మధ్యన నేగడిపిన యౌవనాల మురిపాలకు వందనాలు
ఎన్నడో, యేనాడొ కాదు, కేవలము నిన్న కలలోపల జరిగినది మనకలయిక

మీరుపాటలెన్నొపాడినారు నా యేకాంతమునందుజేరి,
నేము కట్టివుంచినాము:—
ఆకసమున ఘనమగు గోపురమొక్కటి మీ తహతహలను పేర్చికూర్చి
ప్రస్తుతము మననిద్దుర మనలనువీడి పారిపోయినది,
నిద్రమబ్బుకూడ మనలవీడి జాములు గడచినవి.
పట్టపగటి నిండు జాగ్రదవస్థలో వున్నాము, మనమిప్పుడు.
అందుచేత మనము విడిపోవలసినదే, దూరము కావలసినదే.
స్మృతుల సంజవేళలందు మనము తిరిగి కలసికొన్న
ముచ్చట తీరగ తిరిగి మాటలాడుకొందాము.
అట్టితరి మీరుతిరిగి మరోసారి
ఇప్పటికన్నను గాఢమైన సంగీతము వినుపించుడు.
మరో కలలో మనచేతులు కలుసుకొన్న
ఆకసమున మరోగోపురము మనము కట్టుదాము.
ఇటులపలికి అతడు యేదొ సైగజేసె,
తక్షణమే నావికులు తీర బంధనాలు విప్పిపారవేసిరి,
లంగరుకూడ యెత్తిరి
త్వరితముగా ఓడ కదలి పోసాగెను తూర్పుదిశకు
జనమంతయు ఒకేగుండె కలిగినట్లు
ఆ గుండెయు పగిలినట్లు గొల్లెత్తిరి.
ఆ యేడుపు సంజమబ్బులను కలసెను పైకెగురుచు.
దాని ప్రతిధ్వనియు వీడుకోలు బాజాగా కడలి తరంగాలపైన ఆడసాగె,
ఒక్క అల్‌మిత్ర మౌనముగా నిలచి ఓడను చూచుచుండె
అయ్యది మంచునందుచేరి మాయమగుదాక
జనులందరు యెక్కడివారక్కడికి వెళ్లిపోయిననుకూడ
అల్‌మిత్రా ఒక్కతియే నౌకాఘట్టముపైన నిలచియుండె
ఆమె యెదదలో మాత్రము అల్‌ముస్తఫ తుదిమాటల జపము జరుగుచుండె
" కొంత సేపే—గాలి ఊయల నూగుచు సేదదీర్చుకొనుట నేను—కొంతసేపే
అంతలోనె మరోమాత నన్ను తన గర్భానదాల్చు."